# కృష్ణమూర్తి కథలు

# ఆంధ్ర కథావళి

## మూడవ భాగము


గ్రంథకర్త:

తాత కృష్ణమూర్తి, బి. ఏ., యల్. టి.



నమ్మాళ్వార్స్

౨౧, స్ట్రాటన్ ముత్యామొదలి వీధి,

పోస్టుబాక్సు నెం ౨౪౧, మద్రాసు.



సర్వస్వామ్య
సంకలితము.



౧౯౩౮

వెల ఆరు అణాలు
లేక ఒక షిల్లింగు.

రిస్తువాచి, అన్నీ ఆమె సహజసౌందర్యాన్ని ద్విగుణీకరిస్తున్నట్లు తోచేది నాకు. కుచ్చెళ్ళకు చాలని ఉప్పాడపంచ, ఒంటెనిండా పసుపు, నుదుట డబ్బంత కుంకంబొట్టు, మధ్యపాపిట, మెట్టకొప్పు, చాలీచాలని ముతకరవిక, అందెలు, మట్టెలు, వెండివడ్డాణం, వీటితో సంతుష్టిపడవలసిన చదువులేని పూర్వాచారపరాయణులగు అనాగరిక స్త్రీలకు లక్ష్మినిచూస్తే బహుశః యీర్ష్య వలన గిట్టేదికాదేమో! వాళ్ళల్లోవాళ్లు గుసగుసలాడుకునేవారు.

రోజుకురోజుకు నూతనశోభతో వికసిస్తూఉన్న ఆమె అందం, తెలివితేటలు, నాజూకు, అన్నీ నాతర్ఫీదుయొక్క ఫలితమేకదా అని బలే గర్వంగాఉండేది నాకు. నూతన యౌవనావేశాలతో, ప్రణయానురాగసల్లాపాలతో, మాధుర్యానుభవాలతో, మాదాంపత్యజీవిత మొక యెడతెగని యింపైన కలవలె పరిణమించింది ఆమూడేళ్లూ! నీలిమాకాశనిర్మలత్వంలో, చుక్కల తళతళకాంతులలో, చంద్రుని చల్లదనంలో, పువ్వుల మత్తువాసనలలో, పక్షుల కిలకిలధ్వనులలో, సృష్టిలో యెటుచూసినా, దేనినర్థంచేసుకున్నా, అంతా ప్రేమమయమై, సౌఖ్యప్రదమై, మనోహరమై విశదపడేది మాఉభయులకూ.

ఇంతలో హఠాత్తుగా లక్ష్మిలో ఒకవింతమార్పు ప్రత్యక్షమైంది. ఆమె శరీరావయవాలలోనే క్రమంగా యేదో మార్పుపొడగట్టింది. ఒళ్లు నీరుపట్టి నిగనిగమెరిసేది. ఇదివరకు వదులుగానే ఉండినరవిక లిప్పుడు బిగువై పిటపిటలాడేవి. బుగ్గలు బలంగా ఆరోగ్యంతో తళతళ

లాడేవి. చెంపకు చేరడేసిగా ఉన్న దాని విశాలనేత్రాలు అంతకంతకు చిన్నవిగా అవుతున్నట్లు తోచేది నాకు. నడకలో యెప్పటిచురుకుతగ్గి ఒకనాజూకైన వొయ్యారం యేర్పడింది. స్వరం మారిపోయి నూతనమాధుర్యంతో వింతగా వినబడేది ఆమెమాట. ముఖంలో బాల్యచాపల్యం, కొంటెతనం పోయి ఒకవిధమైన గాంభీర్యం స్థిరపడింది. పద్ధెనిమిదేళ్ళ జవ్వని పాతికేళ్ళప్రౌఢవలె కనిపించేది. పూర్వపు యౌవనగర్వం, నునుసిగ్గు, పెంకెతనమ్ము, ప్రణయకోపం, అన్నీ మాయమై చిత్రంగా మారిపోయింది లక్ష్మి. నెలతప్పి, నెలలు గడచినకొలదీ, యెన్నో క్రొత్తసంగతులు అనుభవానికివచ్చి, ఆశ్చర్యంతో, భయంతో, ఆనందంతో బెదురుపాట్లుపడేది ఆమెహృదయం. ఏదో దీర్ఘాలోచనలో మైమరచి ఉన్నదానివలె పరధ్యాసంగా చూసేది అప్పుడప్పుడు నావేపు. ఏమీ అర్థంచేసుకోలేక పిచ్చిపిచ్చి ఊహాలతో మెదడు వేడెక్కించుకొని బాధపడేవాడిని నేను.

మగవాడి బుద్ధి, శరీరంకూడా మందంగా పెరుగుతాయి——ఎంత కృషిచేసి పెంచినాసరే. ఆడదాని ప్రకృతి వేరు. శరీరావయవపరిపక్వంతో జీవితానుభవాలు త్వరగాను ఆమె కవగాహమైనట్లు పురుషుడి కెన్నడూ కాజాలవు. సృష్టిలో స్వభావసిద్ధంగాఉన్న యీభేదాన్ని గమనించక, ఆమెలో అప్పుడప్పు డాకస్మికంగా జనించే మార్పులకు విస్మయంపొంది, అర్థంచేసుకోలేక, అసందర్భంగా ప్రవర్తిస్తాడు పురుషుడు.

# కృష్ణమూర్తి కథలు

"లక్ష్మీ! ఎందుకూ నీ కీదిగులు? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తున్నట్లు ఉంటావేమి? కోపమో, విచారమో, భయమో, ఏదో నీహృదయాన్ని పీడిస్తూఉంది. చెప్పవూ నాతో?" అని మీద చెయ్యివేసి ప్రేమతో నెమ్మదిగా అడిగాను ఒకనాడు.

లక్ష్మికి అవి బలువురోజులు. ఏడో నెలలో పుట్టింటివారామెను తీసుకొపోయినపిమ్మట, మళ్ళీ నెలలు నిండేవరకు నా కామెను చూడడానికి అవకాశం చిక్కలేదు. సాయంత్రం తోటలో చల్లగాలికి కూచున్నాం ఎత్తుగా ఉన్న పచ్చిక తిన్నెమీద. పూల మొక్కలమీదుగా, కమ్మనివాసనలతో, బరువుగా, మందంగా, హాయిగా వీస్తూఉంది జ్యేష్ఠమాసపు మబ్బుగాలి. సూర్యాస్తమయమై అరగంటకు పైగా కావచ్చింది. ఆకాశంమీద అక్కడక్కడ చెదరి దూదికుప్పలవలె గాలికి ఊగులాడే తెల్లనిమబ్బులు సంజకాంతిలో వింతవింత రంగులతో రమ్యంగా కనబడుతున్నాయి. ప్రకృతిశోభ తిలకిస్తూ యిట్లా కూచున్నప్పుడు తన్ను తామరచిపోగల స్వభావం లక్ష్మిది దూరంగా కనబడే నీలికొండలను, చిత్రవిచిత్రాకారాలతో పరుగులెత్తే మేఘాలను, విరగబడి నవ్వుతున్నట్లు గలగలధ్వనులతో గాలికి ఊగులాడే చెట్లను, బారులుతీర్చి కిలకిలారావంతో యెగిరే పక్షులను, ఒడ్డున విరిగి నురగలుజిమ్మే సముద్రపుకెరటాలను పరీక్షిస్తూ గంటలకొలదీ కూచోమంటే విసుగులేదు దానికి. వెర్రిఆనందం!

చేతిమీద గడ్డం ఆనుకొని, ఆకాశంవేపు దృష్టి

నిగిడ్చి, గాలికి తొలగిపోనున్న పైటనైనా సర్దుకోక, బొమ్మవలె కూచున్నలక్ష్మి నామాటలకు కొంచెం అదిరిపడి తిరిగిచూసింది నావేపు. మోచేతివరకూఉన్న దానిగాజులు కొంచెం ఘల్లుమన్నాయి.

కొంతసేపు అట్టేచూసి నా కళ్ళలోకి, మెల్లగా నవ్వుతూ. "...దిగులుపడినదానివలె కనిపిస్తున్నానా?... లేదే!—" అని తల ఊచింది.

"ఇంకో రెండేళ్ళపాటైనా మనని స్వేచ్ఛగా విడిచి పెట్టక అప్పుడే యీగొడవొకటి తెచ్చిపెట్టేనాడా దేవుడు?" అని గొణిగాను నిట్టూర్పుతో.

ఆమాట నేరకపోయి, నోరువిడిచి యేదో అనాలోచితంగా అన్నాను గడ్డితిని. లక్ష్మికి మనసునొచ్చి తీక్ష్ణంగా చూసింది నావేపు. కోపంతో ముఖం యెఱ్ఱజేసి వణుకుతున్న పెదవులతో దెబ్బలాడింది నాతో. పోఁబకు మాటలాడి యెత్తిపొడిచింది. ఉద్రేకం అణచుకోలేక చివరకి యేడ్చింది.

నిష్కారణంగా ఆమెమనసు కలతపరచి, నామనసు కలతపరచుకొని కొరవితో నెత్తిగోకుకున్నట్లయింది నాపని. బుద్ధితక్కువకూతలు కూసినందుకు తగినశాస్తి అయింది నాకు! చీవాట్లతో నెత్తివాచింది. నావంటి తెలివిహీను డీ భూప్రపంచంలో యెవడూ ఉండడని విశదమయింది. నా ఉన్నతవిద్యయొక్క ప్రయోజనం, నా తెలివితేటల గర్వం, నా లోకానుభవజ్ఞానం, భర్త్రాధికారం, వయసు పెద్దరికం, అన్నీ మట్టిలోగలసి, నన్ను నేలకీడ్చి ఓడించి,

అవమానపరచి కసితీర్చుకున్నాయి.

ఔను! భార్యను ప్రియురాలుగా మాత్రమే ఎరిగి ప్రేమించి, ఆమె హృదయమును హరించి, ఆమెలోగల స్వభావసిద్ధమగు సంతానకాంక్ష సర్ధము చేసుకోనలేని మూర్ఖుడు భర్తృత్వం వహించడానికి అర్హుడుకాడు! మాతృత్వంలో ఉండే మహిమ, మాతృప్రేమలో ఉండే ఔన్నత్యం, స్వార్థత్యాగం, ఆనందం, యేదీ తెలుసుకో లేని బుద్ధిహీనుడు నోటికివచ్చినట్లు వదరినప్పుడు చీవాట్లు తగలవలసినదే!

"...ఇదా మీరు మీకడుపున పుట్టబోయే బిడ్డకు చూపవలసిన సన్మానం? ఒక స్నేహితుడుకాని, పెద్దమనిషి కాని యింటికివస్తే ఎంతో మర్యాదచేసి గౌరవిస్తారే! మీ రక్తంలోరక్తం, ప్రాణంలోప్రాణం అయిన యీ నోరెరగని శిశువుకు యిదా మీరిచ్చే ఆహ్వానం?...ఇంకా కొంతకాలం నాకు బిడ్డలు కలగకుండా ఉంటే, మీకు సౌఖ్యంగా, సదుపాయంగా, ఉండేదికాబోలు పాపం! తండ్రితనం వహించడానికి ఉత్సాహంలేనివాళ్లు పెనిమిటి తనం చెలాయించడానికి సిద్ధపడకూడదు."

లక్ష్మి నోరణి చల్లారేటట్లు కనబడలేదు. పశ్చాత్తా పంతో తలవంచుకొని, బదులు పలకకుండా కూచు న్నాను, నన్ను నాలో తిట్టుకుంటూ. ఆమెకు గర్భంవచ్చిం దని నాకణుమాత్రమూ అయిష్టత కలగలేదున్నదూ. ఎందుకో గర్వంగా, బలే సంతోషంగా, కొంచెం భయం గా ఉండేది, ఆవిషయం తల్చుకున్నప్పుడల్లా. కాని అంత

చిన్నయీడున తల్లిదనం వహించడం ఆమె కంతగా మచ్చరించదేమో అన్న శంకమాత్రం అప్పుడప్పుడు కలిగేది నాకు. దాని దిగులుచూపులు, పరధ్యానంచేష్టలు, ముఖవైఖరి కనిపెట్టి అట్లు దురభిప్రాయపడ్డాను.

"లక్ష్మీ! నే నేదో అజాగ్రత్తగా పొరబాటుమాట అనినందుకేనా నీ కీదురహంకారం? బిడ్డలంటే నాకుమాత్రం ముచ్చటలేదా? నామాటలకు విపరీతార్థం తీసి నన్ను నిందించడం న్యాయమేనా? చూడవూ నావేపు? —చా, కళ్ళంట నీళ్ళే!..."

క్షమాపణవేడుకొని ఎన్నెన్నివిధాలుగానో బుజ్జగించిన పిమ్మటకాని, ఆమెహృదయంలో రేగిన కల్లోలం అణగలేదు. దుఃఖం ఆపుకోలేక ఆమె బొటబొట కన్నీరు కార్చినప్పుడు, నిజంగా నామీద నాకే అసహ్యంవేసింది, "పశువులవలె ఇంగితజ్ఞానం లేకుండా ప్రవర్తించానే." అని.

పురిటిరోజులు సమీపిస్తున్నకొద్దీ, లక్ష్మికి చిన్నగా నిద్రపట్టేదికాదు. బడలిపోయిన ఏనుగుగున్నవలె మనిషి భారంగా నడిచేది, ఆయాసంతో, మొగం వాడిపోయింది. నేడో రేపో అని నిమిషాలు లెక్కపెట్టేది వాళ్లఅమ్మ.

"నేనిక్కడ ఉండడం అవసరమని నువ్వు గట్టిగా చెప్తే, మరో పదిరోజులకు సెలవుదరఖాస్తు పంపుతాను." అన్నాను లక్ష్మితో ఒకనాడు.

"అక్కర్లేదు. మీరు వెళ్లండి" అన్నాది, చదువుతున్నపుస్తకం ముయ్యకుండానే.

"అయితే రేపుఉదయమే నాప్రయాణం.....
ఏమిటాపుస్తకం?"

పుస్తకం మూసి, బల్లమీద పడేసింది. "ఇదేనో మాసపత్రిక. నిన్న మంత్రసాని నన్నుచూడడానికి వచ్చినప్పుడు, ఆమెచేతిలో ఉంటే అడిగిపుచ్చుకున్నాను. పురిటికథలు, బాలింతలముచ్చట్లు, శిశువైద్యం, మొదలుగున విషయా లెన్నోఉన్నాయి, యీపత్రికలో. మంచిమంచి తమాషా కథలున్నాయి. అన్నట్టు, 'సంజనిద్రప్రసవ' మంటే యేమిటి కథా? చదివానుకాని నాకు తిన్నగా తెలియలేదు."

"అది కొన్నికొన్ని దేశాలలో ఇప్పు డమలులో ఉన్న పురిటివైద్యం. 'ట్వైలైట్ స్లీప్ మెటర్నిటీ' అంటే, నొప్పులు తెలియరాకుండా పురుడుపోసుకోవడం అన్నమాట." అని టూకీగాచెప్పడం ప్రారంభించాను. "నొప్పులు ప్రారంభించగానే చూలాలును నిశ్శబ్దంగా ఉన్న ఒకగదిలో పడుకోబెట్టి, చేతిమీద ఒకానొక ఔషధం ఇంజెక్షన్ చేస్తారు. వెంటనే ఆమెకు మత్తెక్కి నిద్రవస్తుంది. అదొక చిత్రమైన మత్తునిద్ర. పురిటినొప్పుల బాధ యేమీ తెలియదు. కాని నొప్పులు ఆగిపోవు. అవసరమైనయెడల ఆమెను తట్టి లేపవచ్చును. మాట్లాడవచ్చును. ఆహార మియ్యవచ్చును. ఔషధప్రభావం వదలిన పిమ్మటమాత్రం ఆమెకు ఏసంగతీ జ్ఞాపకముండదు. మందుమత్తులో ఉన్నంతసేపూ ఆమె కలలో ఉన్న దానివలె ప్రవర్తిస్తుంది. పురిటిగదిమాత్రం నిశ్శబ్దంగా

వుండాలి. పెద్దపెద్దధ్వనులేవీ వినరాకూడదు. గదిలో వెలుతురుకూడ అంతగా ఉండకూడదు. సంజచీకటివంటి గుడ్డివెలుగుమాత్రం ఉంచేదాలును. మందుధనరు తగ్గి, చూలాలుకు మెలకువ వచ్చినప్పుడల్లా తిరిగీ ఇంజెక్షన్ ఇస్తూఉండాలి. ఎక్కువసేపు కష్టపడేస్త్రీకి పదిపన్నెండు ఇంజెక్షన్లవరకు అవసరం పడవచ్చును. నిపుణురాలైన లేడీడాక్టరు, ఓర్మిగల మంత్రసాని, — వీరిద్దరికిమించి యితరులెవరూ పురిటిగదిలోనికి రాకూడదు. ప్రసవమైన కొంతసేపటికికాని తల్లికి పూర్తిగా తెలివిరాదు. అప్పుడామె తనబిడ్డను చూచుకొని ఆశ్చర్యపడుతుంది, 'నిజంగా నేనే ప్రసవమై కన్నానా?' అని."

"అయితే, ఎంతో భాగ్యవంతులైన స్త్రీలకుకాని యిట్టి వైద్యసౌకర్యాలు, సామాన్యులకు లభించవనుకుంటా. మన హిందూదేశంలోకూడా ఎక్కడైనా యీ వైద్యం చేస్తున్నారా డాక్టర్లు?" అని అడిగింది లక్ష్మి.

"ఎక్కడో ఒకటిరెండు బస్తీలలో చేస్తున్నారు. కాని మనదేశంలో ధనవంతులకుకూడా సంజనిద్రప్రసవమంటే యేమిటో తెలియదు. మనబోటి సామాన్యుల సంగతి మరి వేరే చెప్పుకోనక్కరలేదు." అన్నాను నిట్టూర్పుతో.

ఒక్కక్షణం ఊరుకొని, "అభాగ్యదేశం మనది!" అన్నాది లక్ష్మి.

మర్నాడు రైయిలుకు వెళ్ళేముందు లక్ష్మివద్ద సెలవుదీసుకున్నప్పుడు కొంచెం చేతులు వణికాయి నాకు.

తలలో మహావిరీతమైన పిచ్చిపిచ్చి ఊహాలన్నీ చెలరేగి ఏదో దిగులుతో గుండె బరువెక్కింది. "ఈ పురిటిగండం గడచి, మళ్ళీ నాలక్ష్మి ప్రజలలో పడుతుందో లేదో? మా యిరువురికీ యివే కడసారి చూపులు కాబోలు?...కాని, లోకంలో ఎందరు సుఖంగా ప్రసవ మవడంలేదు? లక్ష్మి యెడలమట్టుకు దేవు డెందు కన్యాయంచేస్తాడు?...ఇంతకూ విధివ్రాత యెట్లాఉందో? ఏవిట్లాపరిణమిస్తుందో? ..." అని పరిపరివిధాల పోయింది నామనసు. తిన్నగా నిద్రపట్టక రాత్రివచ్చిన పాడుకలలన్నీ తిరిగీ జ్ఞాపకం వచ్చాయి. ముందెప్పుడో లక్ష్మి అనుభవించనున్న పురిటినొప్పుల బాధకంటె దుర్భరంగా పరిణమించిందా నిమిషంలో నాహృదయవేదన. ఎవరిమనసులో ఉన్నభావాలు వారు గుప్తంగా జీర్ణించుకుంటూ, లేనిధైర్యం తెచ్చుకొని, ఒకరికళ్లలో కొకరం నిదానంగా చూచుకుంటూ మెల్లగా నవ్వుకున్నాం, కష్టంమీద విడబడుతూ.

కాని చిత్రం! పురుడువచ్చిన పదకొండోరోజున, మళ్ళీ నేను లక్ష్మిని చూచినప్పుడు, నాకామె ముఖంలో ప్రత్యక్షమైన ఆనందకాంతులలో ప్రసవవేదనల స్మృతిఛాయలైనా గోచరించలేదు. 'నిజంగా యీమె పురిటినొప్పు లనుభవించిందా?' అన్న సంకోచం కలిగింది నాకు. అట్టి సంతోషంతో, మందహాసంతో, మాతృగర్వంతో ప్రకాశించిందామె వదనం! ఒంటినిండాపసుపు, కళ్ళకు కాటుక, పైటకొంగుతో బిగించిన నష్టికట్టు, అన్నీచూసి "ఈబాలింతరాలు నా లక్ష్మేనా?" అని ఆశ్చర్యపడ్డాను.

నులకమంచంమీద పక్కకు ఒత్తిగిలి, బిడ్డను పొమ్ము కానుకొని పాలిస్తూవుంది. నారాక కనిపెట్టి, ముఖం కొద్దిగా యెత్తిచూస్తూ, 'రండి.' అంది మెల్లగా నవ్వుతూ.

మంచందగ్గిర నిల్చుని, వంగి, నిద్రపోతున్న పిల్లడిని బాగా పరీక్షించాను,

"ఏం?...బాగున్నాడా?...ఎవరిపోలికని మీ అభిప్రాయమో చెప్పండి." అన్నాది ఉత్సాహంతో.

"అప్పుడే ఎట్లా తెలుస్తుంది ఎవరిపోలికో?" అంటూ పక్కన నవ్వేను.

"తెలియదూ?...నిదానించి చూడండి! ఆనల్లని ఉంగరాలజుట్టు, ఆపొడుగ్గైనవేళ్లు, ఆకళ్లు, ఆముక్కు,— అన్నీ నావే! ఒక్క గడ్డంమాత్రం మీది. మీవలెనే పొడుగుగా వుంటాడనుకుంటా."

ఏ అవయవంకూడా యింకా స్ఫుటంగా యేర్పడని ఆపసికందులో అప్పుడే యిన్నిలక్షణా లెట్లా కనిపెట్టిందో ఆమెకే తెలియాలి. నాదృష్టికి నిజంగా పసిబిడ్డలందరూ రూపంలో ఒక్కమోస్తరుగానే ఉంటారు—మెత్తని గులాబీరంగు మాంసం బొమ్మలు!

కాని, ఆనందంతో కులుకుతూ, బిడ్డను ఒళ్ళంతా నిమిరి, ప్రతి అవయవం ప్రేమతో తాకి, నాకు చూపిస్తూ, ఎన్నెన్నివిధాలుగానో వర్ణిస్తుంది లక్ష్మి. "ఈ చిన్నిమొగం నాపోలిక కాదేమో చూడండి మరి?" అంటూ వాడి బుగ్గను తనబుగ్గచేర్చి రాస్తూ ముద్దుముద్దుగా నవ్వుతుంది. ఆమె ప్రపంచమంతా ఆబిడ్డే!

# కృష్ణమూర్తి కథలు

మూడేళ్లు శ్రమపడి లక్ష్మిహృదయంలో నేను స్థాపించుకున్న ప్రణయరాజ్యమంతా మూడు నెలలలో తనస్వాధీనం చేసుకున్నాడా బాలుడు. పూర్తిగా మారి పోయింది లక్ష్మి. వెనుకటి రూపమే కాదిప్పుడు. ఆకు నంటుకొని ప్రాకే పురుగు తన శరీరంవదలి, రంగురంగుల రెక్కలుదాల్చి, రమ్యమైన సీతాకోకచిలుకగా మారి, పక్షివలె ఎగిరినట్లు బిడ్డతల్లి కాగానే అత్యద్భుతంగా మారిపోయింది లక్ష్మి. జీవితార్థం తెలుసుకున్న జ్ఞానివలె దివ్యతేజంలో వెలుగొందేది ఆ ముఖం. గంభీరంగా ప్రకాశించే [illegible]. స్వార్థరహితమైనా. [illegible], అగా [illegible] [illegible] [illegible] [illegible] [illegible] రహస్య[illegible] [illegible] కష్టం [illegible]. స్త్రీకి తల్లిదనం ప్రసాదించి ప్రకృతి [illegible] కర్తవ్యాగున్నట్లు చేయగలుగుతున్నం దుకే పురుషుడు గర్వపడవచ్చునేమో అని తోచింది.

బిడ్డసంరక్షణానుగూర్చి తన తిండి, నిద్ర, రూపం, ఆరోగ్యం, నాగరికత—అన్నిటినీ ధారపోస్తున్నా, ఇం కా తృప్తితీరకుండా ఉంది లక్ష్మికి. దాదివద్ద బిడ్డను అట్టే సేపు విడిచిపెట్టి ఉండడానికి ఇష్టపడదు దానిమనసు. దాది, తండ్రి, తల్లి, గురువు—అన్నీ తానేనంటుంది.

ఎత్తుకోమని పిల్లడిని వాళ్ళమ్మ చేతి కందిస్తూ, భద్రంగాపట్టుకోమని చిన్నపిల్లలకు చెప్పినట్లు చెప్తుంది. "పదిలమే, అమ్మా! మెడకింద చెయ్యి వెయ్యి, జాగ్రత్త—"

# తొలిబిడ్డ

నవ్వుతూ ఆవృద్ధురాలు, "ఔనమ్మా! నేనేమైనా బిడ్డలనెత్తుకోవడం యెరుగుదునా మరి?" అంటుంది, అబ్బాయినందుకొని యెగరవేస్తూ.

లోకంలో యింకెవరిబిడ్డలూ తనకొడుకంత చక్కనివాళ్లు, బుద్ధిమంతులు, చురుకైనవాళ్లు కారంటుంది లక్ష్మి.

ఇప్పుడింకా యేడాదిదాటి మూడునాలుగు నెలలవాడేకాని, యిల్లుతీసి పందిరివేస్తున్నాడు పిల్లడు. తప్పటడుగులు వేసుకుంటూ, చురుకుగా నడవబోయి పడుతూ లేస్తూ, యిల్లంతా చక్కబెడుతూ ఉంటాడు! ఎక్కడా ఒకచోట కాలునిలవదు వాడికి. ఒక్కక్షణమైనా చేతులు పనిలేకుండా విశ్రాంతి కోరవు కాబోలు; ఏదో పాడుపని చేస్తునేఉండాలి. ఎక్కడెక్కడ యేయేగదులలోఉన్న ఉప్పులు, పప్పులు, అన్నీ పిడికిళ్ళతో పారబొయ్యడం! అద్దాలు లాంతర్లు, పటాలు, కాఫీకప్పులు, గాజుబొమ్మలు చేతితో సాధ్యంకానప్పుడు కర్రతోనైనా తంటాలుపడి పగలగొట్టడం; బిందెలలోను, చెంబులలోను ఉన్ననీళ్ళు నేలదిమ్మరించి యిల్లంతా వరదచెయ్యడం; దేవుడిపీటం మీదెక్కి, విగ్రహాలను తిరగదోసి, పూజాద్రవ్యాలను విరజల్లడం; భోజనాలప్పుడు అందరి విస్తళ్ళమీదికి యెగబడి అల్లరిచెయ్యడం; పెంపుడు కుక్కను తోకపట్టిలాగి, దాన్ని నానాచికాకు చెయ్యడం; నావ్రాతబల్లవద్ద నిల్చుని చేతికందిన పుస్తకాలు, కలాలు చిందరవందరగా క్రిందపడవేయడం; తాళంగుత్తులతో ఆడుకొని, యేమూలమూల

లనో గంటసేపు వెదికినా మళ్ళీ అవి మాకు దొరకనట్లు విసిరివేయడం; పిల్లికూనల నెత్తుకోబోయి వాటిచేత రక్కులుతిని యేడవడం; చేతికిచ్చినబిస్కట్ ముక్కను కాకికి తినిపించాలన్నసరదాతో పెరటివేపున్న మెట్లమీదికి మాటికీచీటికీ పరుగెత్తడం; తల్లిజడ వేసుకుంటూఉన్నప్పుడు తలనూనెసీసా, ముసలమ్మ వంటచేస్తూఉన్నప్పుడు నూనె గిన్నె, నేను వ్రాసుకొంటూఉన్నప్పుడు సిరాబుడ్డి ఏమూల నుంచో అందుకొని ఒలకబొయ్యడం;—ఇట్లాటి అల్లరి పనులు వాడికి నిత్యకృత్యాలు. ఎంతజాగ్రత్తపడినా సరే మడిలోఉన్న ముసలమ్మకు వాడిమూలాన రోజూ రెండో స్నానం తప్పదు. ఎవరైనా కోప్పడితే పకపకనవ్వుతూ మీదికొస్తాడు, చేతులుచాచుకుంటూ యెత్తుకోమని.

వాడిఅల్లరికి హద్దులేకుండాఉంది. ఇంట్లో ఎవరి మీదా వాడికి పిసరంతలక్ష్యం ఉన్నట్టుకనిపించదు. భయం నేర్పడానికి అప్పుడప్పుడు నేను కళ్ళెర్రజేసి, ముఖం గంభీరంగా పెట్టి, లేనికోపం తెచ్చుకుని గద్దించబోతే కిలకిల నవ్వుతూ చనువుతో మీదపడతాడు. అప్పుడప్రయత్నంగా నాకుగూడా నవ్వొచ్చి, అమాంతంగా వాడినెత్తుకొని బుగ్గలు కందేట్లు ముద్దులాడవలసివస్తుంది. వాడికి భయభక్తులు బోధించడానికి నేనుపడే శ్రమదమాలన్నీ బూడిదలోపోసిన పన్నీరువలె ఎందుకూ అక్కరకురాకుండా ఉన్నాయి. మామిక్కిలి లక్ష్మికూడా వాడిపక్షమే వహిస్తుంది. వాడితోపాటు తనూ చిన్నపిల్లగామారి పోతూఉంది. వాడెట్టి పాడుపనులుచేసినా, ఎంత అల్లరి

చేసినా దానికి ఆనందమే! ఇద్దరూ ఒకటై నన్ను ధిక్కరి
స్తున్నారు.

ప్రొద్దస్తమానం విసుగువిరామం లేకుండా పిల్ల
డితో ఆడుకుందుకు ముచ్చటపడుతుంది లక్ష్మి. ఇంగ్లీషు
పుస్తకాలు, హిందీచదువు, లేసుకుట్లు, ఊలుఅల్లికలు,
అన్నీ మూలపడేసింది. పిల్లడు ఉయ్యాల్లో నిద్రపోతూ
వున్న ఆనాలుగునిమిషాలుకూడా వాడికిసంబంధించిన
వ్యాపకమే యేదోకల్పించుకొని కాలక్షేపంచేస్తానంటుంది
కాని, నాఊసు తలపెట్టదు. ఖరీదైన రంగురంగులగుడ్డ
లన్నీ తెప్పించి పీలికలుగా చించి చిన్నచిన్నచొక్కాలు,
లాగులు, రుమాళ్లు కుడుతుంది. లేదా శిశుసంరక్షణా
విధానం బోధించే పిచ్చిపిచ్చి పుస్తకాలన్నీ చదువుతూ
కూచుంటుంది. లేదా ఇంగ్లీషు కేటలాగులన్నీ తిరగవేసి
రబ్బరుబొమ్మలు, పిల్లల ఆటవస్తువులు, అన్నీ ఒకజాబితా
తయారుచేసి వాటిని తెప్పించమని నాప్రాణాలుతీస్తుంది.
తనతోపాటు నేనుకూడా అబ్బాయివిషయమై తగినశ్రద్ధ
తీసుకోవడంలేదని సాధిస్తూ ఉంటుంది పైపెచ్చు.

మనభాష వాడికి నేర్పడానికిబదులు వాడిభాషే
తను నేర్చుకొని యేమిటో అల్లిబిల్లిగా మాట్లాడుతుంది
వాడితో. ఒక్కొక్కప్పుడు వాళ్ళసంభాషణ వింటూ
వుంటె ఒక్క ముక్కకూడా తిన్నగా తెలియక తెల్ల
మొహంవేసుకొని నిల్చోవాలి నేను.

ఒకనాడు వాడెందుకో ఏడుస్తూఉంటే బెదిరిద్దా
మని వెళ్ళి 'ఏం కావాలమ్మా?' అని నెమ్మదిగా అడి

గాను.

'బూతు' అని గదివేపు వేలుచూపించి మళ్ళీ యేడ్చాడు.

'ఏమిటంటాడు?' అన్నాను లక్ష్మివేపు తిరిగి.

'వినలేదూ?...ఓ జత తెచ్చిపెట్టం డీవాళ.'

'బూతులా?' అన్నాను నిర్ఘాంతపడి.

'అవును.' అన్నాది విరగబడి నవ్వుతూ.

'అంటే?'

'జోళ్లు! ఆమాత్రం తెలుసుకోలేరూ? బూట్లు, బూట్సు అని స్పష్టంగా పలకగలరా యేమిటి చంటి పిల్లలు? ఎక్కడినుంచో తెచ్చి మీ కాన్వాస్‌జోళ్ళతో ఆడుతూవుంటే వాటినిలాక్కొని గదిలో దాచేశాను. అందుకూ ఆయేడుపు!'

లక్ష్మిసమాధానం విని నాలోనేను నవ్వుకున్నాను.

క్రమంగా అబ్బాయితో లక్ష్మికి స్నేహం ప్రబలుతూ ఉన్నకొద్దీ, నామీద నిగా తగ్గిపోవడం మొదలయింది. ఇంట్లో యిప్పుడు నా పెద్దరికం యెందుకూ పనికి రాకుండా ఉంది. అంతా వాడిదేప్రభుత్వం! లక్ష్మి, పిల్లగు యేకమై నన్ను తెరమీదిబొమ్మవలె ఆడిస్తున్నారు.

---

# భీమపాకం

'మంచి సమయం చూచుకొని మరీ కూచుంటావు నువ్వు! ఈ సాయంత్రం దాకా ఓపిక పట్టి ఉంటే, నిజంగా ఎంత సదుపాయంగా ఉండేది? మధ్యాహ్నం రెయిల్లో మీ అమ్మ ఎలాగూ వస్తూ ఉంది కదా, యింతలో ఏం తొందర వచ్చిందని—'

కంటి కున్న చత్వారం జోడు నుదుటికి ఎగద్రోసి, చేత కాఫీ కప్పు పట్టుకొని, మూతి కాల్తూ ఉన్నా మీసాలు అడ్డుపెట్టి ఊదుకొని తాగుతూ భార్యతో కులాసాగా సంభాషిస్తున్నాడు మా మామ.

ముసిముసిగా నవ్వుతూ ఆమె, 'బాగుంది మీరనే మాట!' అని యింకా చెప్పదలచుకున్న జవాబేదో కొంత కళ్ళతో చెప్పి 'పోనీలెండి, యిప్పుడు మించిపోయిందేమిటి? పిల్ల చేత గున్నమ్మకి కబురుచేస్తాను. ఆవిడ మన బంధువు రాలు కాకపోయినా, పాపం చాలా మంచిమనిషి. ఈ పూటకేదో యింత ఉడకవేసి పడేస్తుంది. మీరెందుకు చెయ్యికాల్చుకొని అవస్థ పడడం?' అన్నాది భర్తవైపు నిదానంగా చూస్తూ.

గది వరండాలో వాలుకుర్చీలో చేరబడి, అప్పుడే వచ్చిన ఉత్తరాలూ, వార్తాపత్రికా తీరుబాటుగా తిరగ

వేస్తున్నాడు మామామ, మధ్య మధ్య ఆమెతో ఏవో కబుర్లు చెబుతూ. సావిట్లో ఉన్న గడియారం 2 గంటలు కొట్టింది.

భాద్రపదమాసం రోజులవి. చురికే యెండలు, బలువైన వర్షాలు, రాత్రిళ్లు చలి, పగలు ఉక్క, నదిలో బురదనీళ్లు, ఒంట్లో నీరసం, యింట్లో జొన్నపట్టెలు, దొడ్లో కూరగాయల పాదులు, పశువులకు పచ్చగడ్డి, దేవుళ్ళకు పువ్వులు, మనకు దోమలు, దుర్వాసనలు, గ్రుడ్డిమబ్బులు, ఇంద్రధనస్సులు, నక్కకూతలు—బలే చిత్రమైన ఋతువు! ఆవేళ రోజూకంటె తీక్ష్ణంగా ఉదయించాడు సూర్యుడు. గోదావరిగాలి మనోహరంగా వీస్తూఉంది.

నవ్వుతూ మా మామ, 'ఏం, నావంట అంటే నీకు అంత చులకన ఎందుచేత? ఆమాత్రం గున్నమ్మపాటి వండలేననా? నడ్డివంగిపోయి దృష్టితిన్నగా ఆనని ఆముసలమ్మ నెందుకు శ్రమపెట్టడం? అదిగాక యీవాళ ఆవిడెకు ఏకాదశి. ఉపవాసం బడలికతో ఆమె ఏం వండగలదు పాపం? ఇంతకూ యీవాళ సెలవుదినమే కద! నాకు కచేరీ బెడదలేదు, పిల్లలకు స్కూలు తొందరలేదు' అన్నాడు.

'అన్నీ నిజమేకాని, మీరు వంటకి మడి కట్టుకుంటే గున్నమ్మతో పాటు మనందరం కూడా ఏకాదశి పాలించవలసి వస్తుందేమో అని నా దిగులు!' అన్నాది మా అత్త నవ్వుతూ.

అతని కుర్చీకి కొంచెం యెడంగా ఆ వరండా మీ

డనే కూచొని, జుట్టేలేని చిన్నవాడికి ముచ్చటగా క్రాపింగు దిద్దుతూ ఉంది ఆమె. తల్లి వద్దనుంచి తప్పించు కొని కిలకిలానవ్వుకుంటూ తండ్రి వైపు బంగురుతున్నాడు పిల్లడు. వాడి అన్న ఐదేళ్ళ వెధవయి కూడా యింకా నిద్ర లేవనేలేదు. ఇక లేచిన తరువాత ఇల్లు తీసి పందిరి వేస్తాడు వాడు.

నరుసు, నేను కాఫీల దగ్గిర చిలిపిజగడం పెట్టు కొని, ఉడికింపుమాటలతో ఒకరినొకరం సాధించుకుం టున్నాం. ఇడ్లీ పచ్చడి మారువెయ్యమంటే, నాకంట్లోకి, చొక్కామీద త్రుళ్ళేటట్లు విస్సాటంగా వడ్డించింది నరుసు. కన్ను భగ్గుమనగానే నాచేతులో గ్లాసు దబీమని కిందపడింది. నా లాగుమీద, నరుసు పరికిణీమీద, మేం తింటున్న యిడ్లీప్లేట్లలోను వొలికింది కొంత కాఫీ. ఇంకా మరికి మండుతూ ఉందని గోలచేసింది నరుసు, 'అమ్మో బావచూడవే ఎట్లా'...అని యేమో ఫిర్యాదు చెయ్య బోయిన నరుసును చేత్తో బలవంతంగా నోరుమూసి. చెప్పవద్దని సౌజ్ఞ చేస్తూ గడ్డం పట్టుకొని బతిమాలాను.

వాళ్ళమాటల గొడవలోను, నవ్వులలోను మా అల్లరి తెలియరాలేదు మా అత్తకు, మామకు. లేకుంటే మా యిద్దరికీ చివాట్లు తగిలేవే- ముఖ్యంగా సరి క్రొత్త వెండి గళాసు సొట్టపోయినందుకు.

'ఈవాళ చూద్దువుగాని కదూ, నా వంటమజా! అంత చేతకాని వాడికింద కట్టేయకు మరి నన్ను! వంట అనేది ఆడవాళ్ళకు మాత్రమే అలవడే' మహావిద్య అని

కాబోలు నీ ఊహ? తల్చుకుంటే సంతర్పణ వంటకైనా వెనుదియ్యననుకో!' అంటున్నాడు మామామ బడాయిగా.

అతని మాటలకు నాలో నేను నవ్వుకున్నాను. మా మామవంట యింట్లో ఎవరికి కొత్తగనక? వంటరాదని కాదు. 'థియరీ' అంతా క్షుణ్ణంగా తెలుసును. కాని బ్రాహ్మడికి పిసరంత ఓపిక లేదు. వంటి ల్లొక యుద్ధభూమిగాను, తాను వీరావేశమెత్తిన యోధుడుగాను, ఊహించుకుంటాడు కాబోలు ఆ నాలుగుఘడియలూను' ఇంట్లో ఉన్న యావన్మందినీ అదిచెయ్యమనీ, యిదిచెయ్యమనీ, పురమాయింపులతో నలిపి చంపుతాడు. ముచ్చెమటలు పోసి పోయి, తాను ఆయాసపడి, మమ్మల్ని ఆయాసపెట్టి, అందర్నీ తిట్టి తను తిట్టుకొని. యింట్లో తుపాను లేవనెత్తి, ఇరుగు పొరుగువాళ్ళకు సహితం వెర్రెత్తిస్తాడు.

'నరుసా! ఈవాళ మనపని పట్టిస్తాడులే మామాన్న' అన్నాను రహస్యంగా.

ఇంట్లో వుండకుండా ఎక్కడికైనా దాటేస్తే సరి. పద, తోటలోకి వెళ్ళి జాంకాయలు కోసుకొని, ఆగడ్డిపాక వెనక దాగుందాం' అని సలహాయిచ్చింది నరుసు.

'లాభంలేదు—తన్నులు తగుల్తాయి!' అన్నాను తల ఊపుతూ.

నరుసు, నేనూ ఏంచేద్దామా అని కలబోసుకుంటూ గుసగుస లాడుకోవడంలో మా అత్తామామల సంభాషణ కొంత వినరాలేదు నాకు.

'...చిత్రమైన మనుషులు మీరు! క్షణంక్రింద

టనే కదూ నామీద ఎంతో విసుక్కున్నారు—వంటపని మీమీద పడిందని! ఇప్పుడేమో వండడానికి ప్రజలాట పడుతున్నట్లు, ఎన్నాళ్ళనుంచో అందుకోసం తపిస్తున్నట్లు మాట్లాడుతున్నారు! సరే మీయిష్టం. కాని పిల్లల్ని చద్దిఅన్నం పెట్టుకొని తినమనండి. మీరుకూడా మరో కప్పు కాఫీ అధికం తాగండి. ఎందుకైనా మంచిది. కీడెంచి మేలెంచమన్నారు పెద్దలు' అంటూవుంది మా అత్త నవ్వుతునే.

'అదిగో నాకు తెలుసు నువ్విట్లా అపశకునాలు పలుకుతావని! నా వంట అంటే నీకు ఎప్పుడూ వేళాకో ళమే. ఇట్లా ప్రోత్సాహభంగం చేస్తూ నన్నెగతాళి చెయ్యక పోతే, నీ కేమేమి కావాలో, ఏ యే పదార్థాలు ఏవిధం గా వండితే నీకూ పిల్లలకూ హితవుగా వుంటాయో, అన్నీ చెప్పి చేయించుకోరాదూ?'

'చాలులెండి యీ హెచ్చులు! ఎవరైనా వింటే నిజమే అనుకునేరు. అన్నీ పురమాయించి, మొగుడిచేత పంచభక్ష్యపరమాన్నాలు వండించుకొని విజృంభిస్తూ వుంది కాబోలీవిడె. అని నలుగురూ నన్ను తప్పిపోడవ గలరు! ఇంట్లో ఎవరూ ఆడ దక్షత లేనప్పుడు బయట వుండడ మంటేనే నాకు నిజంగా ఎంతో బెంగగా వుం టుంది.' అన్నాది మాఅత్త.

'పోనీ మానివేయరాదూ?' అన్నాడు మా మామ మెల్లగా నవ్వుతూ.

'అలాగే!' అని తల తమాషాగా తిప్పుతూ, 'ఏమి

టా మాటలు, జ్ఞానంవచ్చిన పిల్లలముందు ?' అని ఛర్రు-
మన్నాది మాఅత్త, లేనికోపం స్వరంలో చూపెడుతూ.

నరుసు, నేను, ఒకరికళ్ళలోకి ఒకరం చూచుకొని ముఖాలు వంచి ముసిముసిగా నవ్వుకున్నాం.

తెలిసీతెలియని యీడు మాది. నరుసు పది పదకొండు ఏళ్ళది. నాకంటె యేడాదో, రెండేళ్ళో చిన్నదైనా, నాఅంత యెత్తూ వుండేది. 'పొట్టిబుడంకాయ' అని నన్ను అదీ, 'పొడుగుబెండకాయ' అని దాన్ని నేనూ, వుడికించునేవాళ్ళం. తెల్లగా, సన్నగా, యేపరిగా వుండేది– పెద్ద కళ్లు, నల్లనిజుట్టు, తెల్లని యెలకపళ్లు, నవ్వితే కొంచంలో తెలుపడే గాజుబుగ్గలు – మంచి అందంగా, చలాకిగా ఉండేది నరుసు. కాని మొగం తీరులోను ఒంటిరంగులోను అది కొంతవరకు తల్లినేపోలినా, పంతానికీ అనవసరంగా నావంటి అమాయకులతో దెబ్బలాడడానికీ ముక్కోపానికీ మూడుమూర్తులా మా మామనే పోలింది !

అన్నివిధాలా యోగ్యుడేకాని కోపంవస్తే ఒళ్లు మరచిపోతాడు మా మామ. మొగం కందగడ్డవలెచేసి వణికే గొంతుకతో ఇంటిపెంకు లెగిరిపోయేటట్లు చావుకేకలు వేస్తాడు. మళ్ళీ కాస్తసేపటికి శాంతమూర్తివలె బహు నెమ్మదిగా మృదువుగా ప్రవర్తిస్తాడు. హృదయంలో కపటం, వైరం లేవతనికి. ఎవరిపట్లా ! ఇంట్లోవున్న నౌకర్లను సహా బంధువులవలెను, స్నేహితులవలెను చూస్తాడు అభిమానంతో. అందుచేత అతను ఇంట్లో ఎవరినేవిధంగా తూలనాడినా ఎవరూ అట్టే నొచ్చుకోరు. కాని

అతని ధాటీకి, ఆగ్రహానికి మా అందరికీ హడలే! ఆరెండు నిమిషాలు అతని కంట పడకుండా ఎక్కడికైనా పారిపోయే వాళ్ళం నరుసూ నేను. ముప్ఫయియేళ్లు ఒంటికొచ్చి ముగ్గురుబిడ్డల తల్లిఅయిన మా అత్తకూడా యింకా భయం తీరినట్లు వర్తించదు ఆయనతో. చనువుగా మాట్లాడుతుంది, హాస్యాలాడుతుంది, తగవులాడుతుంది, వాదిస్తుంది, ధైర్యంగా ఎదిరిస్తుంది—కాని బెదురుతునే వుంటుంది మనసులో.

ఎనిమిదిగంటలకు స్నానంచేసి మడి కట్టుకున్నాడు మామూమ. యజ్ఞం తలపెట్టుకున్నవాళ్ళయినా నిజంగా అంత హడావిడి పడరు. మంచి వుత్సాహంగా వున్నట్లు కనిపించాడు మనిషి.

'అమ్మాయీ, ఈవాళ ఫిడేలు పట్టుకొని కూచోక నాకు అదీ, యిదీ సాయం చెయ్యాలిసుమా నువ్వు. నీ సంగీతం మాస్టరువస్తే, యీపూటకి పాఠంలేదని చెప్పి, పంపించివేయి' అని నరుసుతో చెప్పి, నాతో 'ఒరే రామం, నువ్వెక్కడికీ చపాయించేయక, చదువు గిదువు కట్టిపెట్టి నాకు కొంచం ఆసరాగా వుండాలి వంటింట్లో.' అన్నాడు.

నరుసూ, నేనూ ఒకరిమొగం ఒకరం చూచుకున్నాం, నవ్వురాకుండా మూతులు బిగించుకొని. 'అమ్మా, యిట్లారా,' అని నరుసును దగ్గిరికి పిల్చింది మా అత్త.

'వంటిల్లు శుభ్రంగా ఊడ్చి, పెడపొయ్యిలో నిప్పు చెయ్యి. అప్పలమ్మను తొందరగా అంట్లగిన్నెలన్నీ మసి వుండిపోకుండా తోమి యిమ్మని చెప్పు...తమ్ముడు లేచి

నట్లున్నాడు! వెళ్ళి చూడు, వాడికి కాఫీ వెచ్చబెట్టి యిచ్చి, మీనాన్నగారు వంట ప్రారంభించిన తరవాత, మీరందరూ చల్లన్నాలు పెట్టుకొని తినండి, కొట్లాడుకోకుండా ...పెరడు ఊడుస్తూ వుంది కాబోలాపిల్ల. నాగు. దాన్ని పిల్చి, అశ్బాయికి హార్లిక్సుపాలు కలిపి పొయ్యమని చెప్పు,' అని చెప్పింది. నరుసు గునుస్తూ లోపలికి వెళ్ళింది. తల్లి ఏపని చెప్పినా, దానికి ఎప్పుడూ గునుపే. పని అంటేనే దానికి కొంత అయిష్టత. కొంత బద్ధకం, కొంత పెంకెతన మున్నూ! అందుకు తోడు ఇంగ్లీషుచదువు, సంగీతం, లేసు కుట్లు, తల్లిదండ్రుల ముద్దు, దాన్ని మరింత పనిదొంగని చేస్తున్నాయి.

'అత్తా, లోగడ ఎప్పుడో ఒకసారి మామ వంట చేసి పెట్టాడు మనకి—జ్ఞాపకం వుందీ? 'వంకాయ ముద్ద' అని, ఉడకక పచ్చిపచ్చిగా ఉన్న కూరముక్కలను గరిటెతో గట్టిగా చితకగొట్టి ముద్దగాచేసి విస్తట్లో పెట్టటం,'

'అవును. ఉండ్రాళ్ళు, జిల్లేడుకాయలు వలె తయారైన అన్నం; ఉప్పు కషాయమైన పులుసు; నలగని పచ్చడి—'

'కడుపునిండా తినరేమని కసిరేవాడు పైపెచ్చు!' ఇల్లాంటి ముచ్చట్లే వెనకటి వేవో చెప్పుకుంటూ మా అత్త, నేను, ఉప్పెనగా నవ్వుకుంటున్నాం. ఇంతలో మెడలో చిక్కుపడిన జంధ్యం, భుజాన్ని తడితువాలు, నుదుట విభూతి, దువ్వుకోని సగం నెరిసిన క్రాపింగు, ఎగ

బెట్టి కట్టుకున్న పొత్తిపంచ పీటెతో వచ్చి, కివిగా ద్వార బంధాన్ని ఆనుకొని నిల్చున్నాడు మా మామ.

'ఇక నా ఆలస్యం ఏమీలేదు. బ్రాహ్మడు నీళ్ళు తెచ్చిపోశాడు. కూర, నార యేగో తెముల్చుకొని, చప్పు చప్పున వండేస్తాను. ఏమేమి వండమన్నావో చెప్పు— ఆనక నిష్ఠూరాలాడక.' అన్నాడు మా అత్తతో.

'అట్టే బెడద పెట్టుకొని చికాకు పడకండి. నా మాట విని ఏదో ఒక కూర, యింతపప్పు, అన్నం వండండి; చాలు. ఊరగాయలు; పచ్చళ్లు ఉన్నాయి. ఉట్టిమీద కుండలో తోడుపెట్టిన పెరుగు వుంది. కావలిస్తే ఆనక నాలుగు అప్పడాలు కాల్చుకోవచ్చు' అన్నాది మా అత్త.

'చాల్చాలు, యిదా నీ సలహా! ఏం ఖర్మంవచ్చిం దని యేమీ చేసుకోవద్దంటావు? న్యాయం పట్టి పిండివం టలుకూడా తలపెట్టుకోవలసిన సంగతి. మనం పెద్దవాళ్ళం ఎట్లా కాలక్షేపం చేసినా పిల్లలు ఊరుకుంటారా? అమ్మా యికి పెరుగుపచ్చడి కావాలి; అబ్బాయికి పులుసో చారో వుండితీరాలి; రామానికి వేపుడుముక్క ఉండాలి!'

'ఇంకా—?' అంటూ నవ్వింది మా అత్త.

'అవునే మరి! అర్ధాకలితో విస్తరిముందు నుంచి లేచిపోలేం కద?'

'విస్తరిముందు కూచునేదాకా రావద్దూ కథ?'

'మా చక్కా వస్తుందిలే, మరేం భయపడకు! ప్రపంచంలో మనం పడే అవస్థలన్నీ అసలు దేనికోస మని? తిండికే కద? అంచేత, చేసుకున్న పదార్థాలేవో

తృప్తికరంగా కడుపు నిండేటట్లు వుండాలి.'

'నిజమే—చేసి పెట్టేవాళ్లు వున్నప్పు డామాట !'

'నేనన్నదీ అదే కదూ ? ఇంగ్లీషు వాళ్ళలో ఒక సామెత వుందిలే, 'ఎండ కాచినప్పుడే గడ్డి తయారుచేసుకోవాలి' అని. ఎప్పుడో కాని రావుకద, యిటువంటి అవకాశాలు! పురుషపాకం—అందులో భర్తది—తలవని తలంపుగా తటస్థపడినప్పుడు, నిజంగా ఎంత సంబరపడాలి నువ్వు? నాలుగూ చేసి పెడతాను, తినమంటే, వద్దంటావేం ఖర్మం? నాకు శ్రమ అనా? వుత్సాహంతో కోరి చేసే పనిలో ఎప్పుడూ శ్రమ వుండదు. లేక నాకు చేతకాదనా? చూడు, ఈవాళ నల భీమపాకాలను మించి, దేవతలకు సహితం నోరూరేటట్లు తయారు చేస్తానో లేదో వంట!'

'మీ పుణ్యముంటుంది, అంత పనిమాత్రం చెయ్యకండి ! లేకుంటే దేవతలు, పితృదేవతలు, అంతా దిగి రాగలరు ఈవాళ!' అన్నాది మాఅత్త విరగబడి నవ్వుతూ.

'పది గంటలకల్లా నీకు వడ్డించలేకపోతే అప్పుడను ఆమాట' అంటూ గడియారం వైపుచూసి మళ్ళీ ఆమెతో 'చప్పున తెములుస్తు మరి శాకపాకా లేమిటో—' అన్నాడు మామామ.

నవ్వు సమాళించుకొని 'అబ్బ! మీ యిష్టంవచ్చిందేదో చేసుకూ నన్ను అడకక్క. బుట్టలో ఏవో కూరగాయలు దుంపలు వున్నాయి. పెరట్లో ఏరితే ఇంకా కాయగూర లేమైనా దొరుకుతాయి. మీకు ఏమేం కూరలు పచ్చళ్లూ ఏయేవిధంగా చెయ్యాలని ముచ్చటయితే ఆ

విధంగా చెయ్యండి' అన్నాది మా అత్త.

'నిజమేనా? ఆనక ఆక్షేపించవు కద?'

'ఛా ఎంతమాట!'

'అయితే సరే. సర్వస్వాతంత్ర్యం నాకే విడిచిపెట్టానన్నమాట?'

'పూర్తిగా!'

'ఇక చూసుకో అయితే! పప్పు, ఒకటో రెండో కూరలు, వంకాయో, దోసకాయో కలిపి పెరుగుపచ్చడి, అరవవాళ్ల సాంబారో లేక కొబ్బరివేసిన మలబారు చల్ల పులుసో—'

'లేకపోతే పోలాల అమావాస్యతోను వండుకునే పొడుకూరల బెల్లం పులుసో—'

'అవును సుమా, బాగా జ్ఞాపకం జేశావు!' అన్నాడు మా మామ, తల ఊపుతూ.

'ఇంకా జ్ఞాపకంచేస్తాను కావలిస్తే, మీకు మనసు వున్న ముసిలి తిళ్లన్నీ! కొళంబు, బెంగుళూరు కూటు, [illegible]ల బెస్సారు, ములగకాడల రసం, వడియాల ఇగురు, పెసరట్ల కురమా, పనసపిక్కల పప్పుకూర.—'

'అదిగో, వేళాకోళం చేస్తున్నావా?'

'మరి కాకపోతే ఎందుకొచ్చిన కవిత్వాలు చెప్పండి,—ఏదో యీపూటకి కిరిదీ గడుపుకోక? లేనిపోనివన్నీ తలపెట్టుకోవడం, ఆనక తెమలలేక చీదరించుకొని నానా చికాకూ పడిపోవడమున్నూ!'

'అదా నీభయం?'

అంతేకాదు. మీరు శ్రమపడి అన్నీ చెయ్యడమే కాని, ఎవరా తినేవాళ్లు ఇంట్లో? మనపిల్లల సంగతి యెర గరా యేమిటి మీరు? ఎప్పుడూ భోజనాలదగ్గిర అల్లరి పెట్టడమే, పెట్టిన అన్నాలలో రోజూ సగం పారెయ్య డమే కద?'

'అయితే పోనీలే- ప్రోగ్రామ్ చాలావరకు టూకీ చేసేదాం! ఒరే రామం వెళ్లిచూడు—పాదుల్ని కూర లేమైనా దొరుకుతాయేమో...నరుసు ఏదీ? అమ్మణీ-'

'వంటింట్లో నిప్పుచేస్తూవుంది కాబోలు' అన్నాది మాఅత్త.

'పాపం దానికేం చాతసవుతుంది! నేనే చేసుకు టూను' అంటూ లోపలికి వెళ్ళిపోయాడు మా మామ.

తరవాత కొంతసేపటికి పందిరెక్కి నేను దొండ కాయలు కోస్తూఉండగా వంటింట్లోనుంచి పిలిచాడు నన్ను.

'త్వరగా రా! ఏంచేస్తున్నా వక్కడ?'

బుట్టతో కాయలు పట్టుకొని పరుగున వెళ్లాను వంటింటి గుమ్మం దగ్గరికి. అతని మొగం నాకు, నా మొగం అతనికి కనబడనంత దట్టంగా క్రమ్మి ఉంది అక్కడ పొగ!

'ఆబుట్ట అక్కడపడేసి, చప్పున వెళ్ళి విసనకర్ర తీసుకురా, పొయ్యి మండకుండా ఉంది' అంటూ తిరిగీ పొయ్యి ఊదబోయినాడు నోటితో.

నిప్పురవ్వలు ఎగిరి అతని మొగంమీద పడ్డాయి. కళ్లు వేళ్లతో మూసుకొని నులుపుకుంటూ, యెడంగా

జరిగాడు పొయ్యి వద్దనుంచి.

ఇల్లంతా గాలించినా నాకు విసనకర్ర ఎక్కడా కనపడలేదు. అందరం అన్నిపనులూ విడిచిపెట్టి దాని కోసం వెదకడం ప్రారంభించాం.

'తెచ్చావా?' అంటూ మళ్లీ వినవచ్చింది మా మామ కేక.

'పోనీ అబ్బాయిగారూ, నేను నీళ్లపొయ్యి ఊదుకునే వెదురుగొట్టం వుంది—తీసికెళ్లండి' అన్నాది అంట్లు తోముతున్న అప్పలమ్మ.

ఈలోపున అక్కడి పొగకు తాళలేక వచ్చి నావిట్లో నిల్చున్నాడు మా మామ—అంగవస్త్రంతో కళ్లు అద్దుకుంటూ. కళ్లు ఎఱ్ఱబడి నీరు కారుతున్నాయి. మొగం కందింది. తలమీద ముగ్గుజల్లినట్లు అక్కడక్కడ బూడిద పడి వుంది.

'మరి కాస్త కిరసనాయిలు పోసి ముట్టించండి' అని సలహా ఇచ్చింది మా అత్త.

'ఇప్పటికి మూడుసార్లు అయినది అట్లా—ఏం ప్రయోజనం? ఆకట్టెపుల్లలు పచ్చివో, లేక వర్షంలో తడిశాయో! ఎంతసేపూ పొగే కాని మంట లేదు.—ఇంట్లో ఎక్కడా ఓ విసనకర్ర లేదూ?' అన్నాడాయన కొంచెం విసుగుదలతో.

'లేక నేం? ఏమూలనో పడేస్తారు పిల్లలు, ఎక్కడి వస్తువు అక్కడ వుండనివ్వరు.'

'సమయానికి దొరకదు, ఏవస్తువైనా సరే యిం

యింట్లో! మళ్లీ యింటినిండా వున్నారు ఇంతమంది. తిండికితప్ప మరిదేనికీ పనికిరారు. ఒళ్లువంగనితనం కాకపోతే, ఎవరికీ కనపడదా విసనకర్ర ?'

ఇంతలో వెదురుగొట్టం తెచ్చి, 'ఇదిగో యిదిదొరికింది' అని చేతికిచ్చాను నేను.

అందుకోని, 'ఇదా తెమ్మన్నాను నిన్ను? ఇదెందుకు నీ నెత్తి మీాదికి?' అంటూ కోపంతో నేలమీాద విసిరి కొట్టేడు.

గొట్టం పగిలి రెండు చెక్కలయింది.

ఈలోపున సరుసు వెళ్ళి, ఎట్లాగో అవస్థపడి పొయ్యి మంట చేసింది.

'పొయ్యి మండుతూంది, నాన్నా,' అని వచ్చి చెప్పింది.

ఆ మాటతో అతని కోపం కొంత చల్లారినట్లు కనబడింది. మరేమీ అనకుండా వంటింట్లోకి వెళ్ళిపోయినాడు.

ఇంతలో నౌఖరీ పిల్ల నాగు వచ్చి నాతో, 'ఇదిగోనండి అబ్బాయిగారు, యిసనకర్ర—ఆ గదిలో కానొచ్చింది' అన్నాది.

అది పుచ్చుకొని లోపలికి వెళ్ళాను నేను.

ఈలోపునే కేకవేస్తున్నాడాయన.

'ఇక్కడ మంచినీళ్లబిందెమీాద వుందర్రా విసనకర్ర! మరి వెతక నక్కరలేదు. ఏడాదిదాకా వెదికినా ఎదురుగా వున్నవస్తువుకూడా కనపడదు మీా కళ్లకి!'

'ఇదిగో దొరికింది మామా మరొకటి' అన్నాను నేను.

'ఇప్పుడు దొరుకుతాయి ఎన్నయినా—అవసరం తీరిపోయిన వెనకాల' అన్నాడాయన గుర్రుగా.

వంట ప్రారంభమైనది మొదలు మా మామకు ఇదీ అదీ అందించడంతో సరిపోయింది నా పని. ఈగిన్నె తెమ్మనీ, ఆగరిటె ఎక్కడుందో చూడమనీ, పప్పుడబ్బా ఎక్కడ పెట్టిందో అత్తను వెళ్ళి కనుక్కో మనీ—యిలా నిమిషనిమిషానికీ ఏదో ఒకటి పురమాయిస్తూ వుండే వాడు. నరుసు కూరలు తరుగుతూ వుంది,—తద్దినం వంటకి సరిపోయి నన్ని!

'అమ్మా, ఆ దొండ కాయలు అట్లా తరిగితే ఎన్నాళ్ళ కవుతుంది నీ పని? అలాకాదు. అవి తరిగే మోస్తరు నేను చెప్తాను ఉండు' అంటూ దాని వద్ద నుంచి కత్తిపీట తీసుకొని, తనో రెండు కాయలు తరిగి చూపించాడు మా మామ.

చప్పు చప్పున తరగడంలో జిగురుగా వున్న ఒక కాయ ఆయన చేతిలో నుంచి జారిపోయింది. కుడిచేతి బొటనవ్రేలు కత్తి పీటకు ఆని కొంచెం తెగింది.

'చెయ్యికోసుకున్నారు నాన్నా! రక్తం కారుతూ వుంది' అన్నాది నరుసు బిక్కమొగంతో.

'ఫరవా లేదు లే—కాని తరిగేమోస్తరది! తెలిసిందా?......రామం, వెళ్ళి తమలపాకులడబ్బాలోని కాస్త సున్నం తీసుకురా; వేలుకి పెట్టాలి' అన్నాడు.

ఆ వేళ వంటకు శకునాలన్నీ ఒక్కమోస్తరుగానే పరిణమించాయి. పప్పు, కూర చెరో పెడమీద వుడక వేశాడు మామ. మొదట మండడంలో పొయ్యి కొంచెం అవస్థ పెట్టినా క్రమంగా బాగానే అంటుకుంది. ఎంత పొగలేచినా కొంతమంటకూడా తగిలేది గిన్నెలకు. అర గంట అయింది పొయ్యిమీదగిన్నె లెక్కించి. కాని ఎప్పటికీ ఆకూర, పప్పు వుడికి మెత్తపడే ధోరణిలో లేనట్లు తోచింది మా మామకు. గరిటెతో వాటిని అడుగడుగికి కెల్లించి కలుపుతాడు. పొయ్యిలో కర్రలు పదేపదే ఎగసన తోస్తాడు. తనలో తాను ఏమేమో గొణుగుకుంటాడు చికాకుతో. అప్పుడప్పుడు గరిటెతో తీసి ఒక కూరముక్కను వ్రేలుతో నొక్కి చూస్తూవుంటాడు. ఎప్పటికీ ఆకూరముక్కలు మెత్తగిల్లకపోవడం సరేకదా, మీదుమిక్కిలి ఉడికిన కొద్దీ గట్టిపడుతున్నాయా అని సందేహిస్తాడు.

కూరపరీక్షలో చివరకు చెయ్యిచురికించుకొని, వేళ్లు ఊదుకుంటూ సావిట్లోకివెళ్ళి గడియారంచూచాడు.

'ఏమండీ అప్పుడే టైమ్ చూస్తున్నారు—వంట ఎంతవరకు వచ్చిందేమిటి?' అని ప్రశ్నించింది మా అత్త.

'వుండవే—వెధవవంట: చెయ్యికాలి పొక్కిపోతోంది!'

'అయ్యో ఎట్లా కాలిందేమిటి? గంజిపడిందా? ఏదీ చూడనీండి'—అంటూ ఒక అడుగు ముందుకు వచ్చింది మాఅత్త.

'లేదులే—కాని ఆ కూర, పప్పు ఒకంతట ఉడకవేం? కొంచెం సోడాగుండ వేస్తునా, చప్పున మెత్తపడతాయేమో?' అన్నాడు మా మామ.

'సోడాగుండ ఎందుకండీ, గుణుపురం కంది పప్పుకి? వెన్నవలె ఉడుకుతుంది ఐదు నిమిషాలలో!'

'సీ మొహం! ఇప్పటికి అరగంటకు పైగా అయింది ఉడకవేసి. వేసినపప్పు వేసినట్లే వుంది, రాళ్ళలాగు'

'ముందే ఉప్పు వెయ్యలేదు కద కొంపదీసి?'

'ఆమాత్రం తెలియదనుకున్నావా యేమిటి?'

'అయితే ఉడక్కపోవడ మేమిటి చెప్మా!' అంటూ క్షణం ఆలోచించి, మంచినీళ్లే పెట్టేరా ఎసరుకి?' అని అడిగింది మా అత్త.

'ఏమో సుమా, మరి! ఆబ్రాహ్మడు బిందెలతో నీళ్లుంచా డక్కడ తిన్నె మీద. ఏవి మంచినీళ్ళో ఎవడు శోధించేడు—ఆహాగలో?'

'మంచినీళ్ళయితే యిప్పుడే తెచ్చిపోశాడు గనుక, కొంచెం బురదగా కానరావండీ? మీరు ఉప్పునీళ్ళే పోసి వుంటారు; పొరపాటున!'

'అయితేమాత్రం కొంచెం ఆలస్యంగానైనా ఉడకాలా; లేదా?'

'ఈసత్రంనూతి నీళ్లతో ఏదీ తిన్నగా ఉడకదు—పాడునీళ్లు. అందులోనూ, వేచిన కందిపప్పు అయితే యిక అడిగే దేమిటి?...ఇంకా కూరమాట చెప్పకండి! ఏదో ఒకమోస్తరుగా ఉడుకుతుంది.' అన్నాది మాఅత్త.

'ఆకూర కూడా అలాగే వేదుస్తూ ఉందిగా! మంట బాగా తగులుతూవుంది గనుక, యీపాటికి ఉడికి ఉండదా అనుకొని మొదట చూడకుండా ఆనీళ్లు వార్చేసి, యింత చింతపండు పులుసు, ఉప్పూ, పసుపు తగలేశాను అందులో. ఆపులుసు, ఉప్పూ ఇగిరిపోయేయి కాని ఆ కూర మెత్తపడదు.'

'ఏం కూర అది?'

'దొండకాయలు.'

'అలాచెప్పండి!' అంటూ మెల్లగా నవ్వింది మా అత్త. 'అసలు దొండకాయలు ఉడకడమే ఆలస్యం. అంగుకుతోడు మీరు పులుసుకూడా పోశామంటున్నారు. పులుసువేసి ఉడికిస్తే కొన్నికూరలు ఉడకవు. ఏకూరైనా ఉడుకుతుందికాని దొండకాయ మాత్రం ఉడకదు— గోజల్లో ఉడికించినాసరే!'

'అలాగా?...అయితే ఇప్పుడు కర్తవ్యమేమిటి? ఏం చెయ్యమని నీసలహా?' అన్నాడు మా మామ. మా అత్తకు కూడా యేమీ పాలుపోలేదు కాబోలు. ఇద్దరూ మొగాలు చూసుకొని వెర్రిగా నవ్వుకున్నారు.

ఇంతలో గోవిందనామాలో, యేవో శ్లోకాలో మెల్లిగా జపించుకుంటూ ఒకచేత దేవుడి ప్రసాదం కాబోలు ఒక కొబ్బరిచిప్ప రెండరటిపళ్ళు పట్టుకొని రెండోచేయి నడ్డిమీద ఆనుకొని, సన్నని మడిపొత్తి పంచతోవచ్చి ఎదురుగా నిల్చుంది గున్నమ్మ అవ్వ! కోవెలకు వెళ్ళివస్తూ ఓసారి మమ్మల్నిచూసి పోదామని ఊరికనే వచ్చినట్లుంది

ముసల్ది. కాని నా ప్రాణానికి అప్పుడావిడె సాక్షాత్కరించిన వరదేవతవలె కనబడింది!

మడితో ఉన్న మా మామను; ఎడంగా నిల్చున్న మా అత్తను అట్టే చూసి, సంగతి గ్రహించుకొని, 'ఎప్పుడేమిటి?' అన్నాది ఆమె.

'ఈ ఉదయమే,' అన్నాది మా అత్త ముసిముసిగా నవ్వుతూ.

'అయితే నాకు కాస్త కబురు చెయ్య లేకపోయినావటే?... బాగుంది, మీరూ మీ మొగమాటమున్నూ. ఎవరైనా వింటే నవ్వుతారు... పోనీ, నయమే అయింది నే నిప్పుడు రావడం—' అంటూ తన చేతిలో ప్రసాదం పిల్లలందర్నీ దగ్గిరికి పిల్చి పంచింది.

చనువుతో మీదికి చేతులు చాపుకొంటూ వచ్చిన చంటి వాడిని ఒకమాటు ఎత్తుకొని, 'దిగు నాయినా,— పొద్దెక్కి పోయింది,—చప్పున నీకు బువ్వవండి పెట్టొద్దూ మరి?' అంటూ తిన్నగా వంటింటివైపు నడిచిం దామె.

'అవ్వగారూ; మిమ్మల్ని శ్రమ పెట్ట కూడ దనుకున్నాం యీవాళ. కాని దేవుడులాగ వచ్చారు సమయానికి' అన్నాడు మా మామ.

మా అత్త నవ్వింది.

---

# పెంపుడు కుక్కలు

నాడు కాలేజీకి సెలవుదినం కదా అని నారాయణ రావు, నేను జంతుప్రదర్శనశాల చూడడానికి బయలుదేరి నాము. అక్కడ కలిశాడు మాకు ప్రకాశం. పరిచితులలో వాడి తెలివితేటలు ఆట్టే ఉపచరించేవి కావుగాని, నిజంగా ప్రకాశం చాలా చురుకైనవాడు. వాడితో కూచుంటే మా హాస్టల్లో ఎవడికీ చదువు, సంధ్య తలపెట్టడానికి మనసు ఉండేదికాదు. తమాషా అయిన కబుర్లు చెప్పి, నవ్వించి, అందరినీ రంజింపజేసేవాడు.

కులాసాగా ముగ్గురం కొంతసేపు తిరిగి, కబుర్లు చెప్పుకుంటూ, ప్రొద్దుగ్రుంకే సమయానికి సముద్రతీరం చేరుకుని, ఇసుకలో కూచున్నాం విశ్రాంతికి. మావలెనే అనేకులు తెల్లవాళ్ళు, నల్లవాళ్ళు, యువకులు, వృద్ధులు, స్త్రీలు, చిన్నపిల్లలు అందరూ 'బీచి' వద్ద చల్లగాలికి విహారించడానికి వచ్చారు. మాకు కొంచెందూరంలో హాయిగా మాట్లాడుకుంటూ, కిలకిల నవ్వుకుంటూ ఒక దొర, దొరసాని నిల్చున్నారు కెరటాలవేపు చూస్తూ. ఆమె ఒక తెల్లని జూలుకుక్క నెత్తుకొని, దానిని రొమ్ము కదుముకుంటూ, దానితో ఏవో కబుర్లు చెబుతూ, దాని కళ్లలోకి చూస్తూ, ఎంతో ముద్దుగా దాని చెంపను తన

తలపెట్టక పెంచే జంతువు లొక్క కుక్కలే! అవి పని చెయ్యనక్కరలేదు. గుడ్లు పెట్టనక్కరలేదు. బలి పశువులుగా ఉపయోగపడ నక్కరలేదు. హాయిగా తింటూ, తిరుగుతూ, మహారాజభోగంతో బ్రతకడానికి నోచుకున్న ధన్యజీవు లవి!'

'ఇది కలియుగమన్న మాట మరచిపోయి, పార్వతీ పరమేశ్వరు లెప్పుడైనా భూసంచారానికి బయలుదేరి గ్రహచారవశాత్తూ నాకంట బడడమే తటస్థిస్తే, రాబోవు జన్మలో నన్ను పెంపుడుకుక్కగా పుట్టించమని వరం అడుగుతాను వీలైతే సీమకుక్కగా పుట్టించమంటాను. ఇట్లాంటి విషయాలలో 'స్వదేశీ' అభిమానాలు పెట్టు కుంటే లాభంలేదు. ఇంగ్లీషుకుక్కగా పుడితే నిజంగా జన్మసార్థక మవుతుంది. నరజన్మలో తీరని హృదయబాధక మైన వాంఛలు కొన్ని అప్పుడు తీర్చుకోవచ్చును. కొందరు దొరసానులకు తమ ఆప్తబంధువులమీదకంటె పెంపుడు కుక్కల మీద యెక్కువ అభిమానమట! యజమాను రాలితొడమీద కూర్చుని, ప్రేమతో ఒడలంతా తా కుతూ, నిర్భయంగా నలుగురిలో మూతి ముద్దులాడగల మహాభాగ్యం సీమకుక్కలకుగాక ఎవరికి లభ్యమౌతుంది? ఆమె యెడల కన్నబిడ్డలకు లేని చనువు, గృహయజమానికి లేని అధికారం చెలాయించగలవు అవి.'

'సీమకుక్కలది నిజంగా దేవేంద్రభోగం. వాటి మీద గృహయజమానికి, యజమానురాలికి, పిల్లలకు, బంధువులకు, నౌకర్లకు, అందరికీ గారాబమే! వాటికి

దుస్తులు, పరుపులు, కుర్చీలు, సోఫాలు, మిఠాయిలు, నౌకర్లు, వైద్యులు, మోటారుకార్లమీద షికార్లు, ఉత్తమజాతి కుక్కలతో సంబంధబాంధవ్యాలు యేర్పరచు కుందుకు తగిన అవకాశాలు, ఒకటేమిటి?—భూలోకంలో అనుభవించతగిన భోగాలన్నీ వాటివే!

'ఈ తెల్లవాళ్లు కుక్కలమీద ఖర్చుపెట్టే డబ్బు యింత, అంత కాదు. వేలకువేలు పోసి కొంటారు కుక్కల్ని. మన హరిశ్చంద్రుడే తెల్లదొర అయివుంటే, అడవిలో ఉన్నప్పుడు ఓ రెండు కుక్కల్ని సంపాదించి, వాటిని అమ్మేసి విశ్వామిత్రుడి అప్పు సుళువుగా తీర్చగలిగి ఉండును-పెళ్లాన్ని అమ్ముకోవలసిన అవసరమే లేకపోవును!

'అయితే, పులినిచూసి నక్క వాతలుపెట్టుకు న్నట్లు, మనవాళ్లుకూడా యిప్పుడిప్పుడు కుక్కలమీద మోజుపడడం నేర్చుకుంటున్నారు. మన జమీందార్లకు, ఉన్నతోద్యోగస్తులకు తమ కుక్కలమీద ఉండే అభిమానంలో నూరోవంతు తమ ప్రజలమీద, సేవకులమీద ఉంటే, దేశంలో యింత అశాంతికి కారణమే లేకపోవును. ప్రపంచంలో కుక్కలనిమిత్తం వ్యయమయ్యే ధనం మనుష్యులనిమిత్తం వినియోగపడితే, ఏ దేశంలోనూ దరిద్రమనేది ఉండకనేపోవును!

'కుక్కలమీద మానవుడికి మరింత మమత ఉండడానికి నిజమైన కారణంకూడా ఏదీకనబడదు. కుక్కలు అందమైన జంతువులనీ; నేర్పితే సర్కస్‌వాళ్ళవలె మొగ్గలు వేసి చూపరులను రంజింపజేస్తాయనీ; దొంగలను రానీయ

కుండా యజమానుడి యిల్లు కాపాడతాయనీ; వేటకు ఉప యోగపడతాయనీ ; ఇంట్లో పిల్లులను, ఎలకలను చేర నియ్యకుండా చేయగలవనీ; సమయంవస్తే పాముల్నిగాని, పెద్దపులినిగాని ఎదిరించి, చంపి యజమానిని రక్షిస్తాయనీ; మనుష్యులవలెనే వాటికి బుద్ధిజ్ఞానాలు మెండుగా ఉన్నా యనీ; ధైర్యం, భక్తి, విశ్వాసం, స్నేహం మొదలైన గొప్పగొప్ప గుణాలుగల ఉత్తమజాతి జంతువులనీ, ఏవేవో అసందర్భమైన కారణాలు చెప్పడం తెలివిహీనం! కుక్కల కంటె అందమైనవి, చురుకైనవి, విశ్వాసంగలవి, ధైర్యం గలవి అనేకజంతువులున్నాయి. కాని సమస్త జీవరాసుల లోను కుక్కలే నరుడికి ప్రాణస్నేహితులై ఉంటూ ఉండడం కేవలం భగవంతుడి చిద్విలాసం !

'మనవాళ్ళకంటె తెల్లవాళ్ళకు కుక్కలమీద శ్రద్ధాభిమానాలు అధికం ఇంగ్లీషు కవులెందరో ప్రాశా రు కుక్కల్ని గూర్చి తమ గ్రంథాలలో, నవలలలోను, నాట కాలలోను, పద్యాలలోను కుక్కలను పొగడి, గౌరవించి, వర్ణించి, వాటిచేష్టలను మెచ్చుకొని, గుణాలనెన్ని, వాటి కోసం నెత్తినోరూ కొట్టుకొని, గుండె పగిలేటట్లు యేడ్చిన కవులున్నారు వాళ్ళలో! ఇంగ్లీషువారపత్రికలలో కుక్కల ప్రసంగం లేకుండా ఉండదు. ఫలానా ప్రభువు ఆస్ట్రేలియా నుండి ఒకజోడు గొర్రెమూతి కుక్కపిల్లల్ని విమానం మీద తెప్పించారనీ, ఫలానా మిస్సమ్మగారి బొచ్చుకుక్క సుఖప్రసవమై పావుడజన్ కూనలను కన్నదనీ, ఫలానా పేరుగల పందెపుకుక్కను దొంగిలించిన వారి ఆచోకీ

తెలియజేయగలవారికి వెయ్యి బంగారుకాసులు బహుమాన మియ్యబడుననీ, బ్రిటిష్ జంతుప్రదర్శనశాలకు క్రొత్తగా తెప్పించబడిన తోకలేని కుక్క న్యూమోనియా జబ్బువలన అస్వస్థతగా నున్నదనీ, నక్కవేట కొకానొక కోటీశ్వరుడు మూడువందల కుక్కలతో బయలుదేరు చున్నట్లు తెలియవచ్చుచున్నదనీ, కుక్కలనుగూర్చి ఎన్నో ముచ్చట్లు, వ్యాసాలు, ప్రకటనలు అనునిత్యం ప్రకటింపబడుతూ ఉంటాయి పత్రికలలో. కుక్కల్ని పెంచి వాటిని తరిఫీదు చెయ్యడమే కొందరు దొరలకు ముఖ్యవృత్తి. ఇంగ్లీషు జంతువైద్యశాలలు ముఖ్యంగా కుక్కలకోసమే యేర్పరచబడినవి! కుక్కలకు ప్రత్యేకంగా తయారుచేయబడిన సైకిల్సు ఉన్నాయి. టోపీలు వున్నాయి. ఆట వస్తువులున్నాయి. కుక్కలకోసం ఇన్సూరెన్సుకంపెనీలున్నాయి. బిస్కట్ ఫ్యాక్టరీ లున్నాయి హోటళ్లున్నాయి. రైలుబండ్లలో ప్రత్యేకంగా పెట్టెలు యేర్పాటై వున్నాయి. తెల్లవాళ్ళ ధర్మమా అని, నేటి మానవసంఘంలో కుక్కకు ప్రత్యేకస్థలం యేర్పడింది!

'మన పూర్వుల కెందుచేతనో కుక్కలపట్ల ఆశ్తే అభిమానం కుదరలేదు. భారతరామాయణాదిగ్రంథాలలో కుక్కల ప్రశంస బహుతక్కువ! కుక్కల్ని స్తుతిస్తూ గాని, కుక్కలకు అంకితమిస్తూగాని మన కవులెవరూ పుస్తకాలు వ్రాయలేదు. మన ప్రబంధాలలోని నాయకీమణు లెవరూ పెంపుడుకుక్కల్ని వెంటబెట్టుకొని ఉద్యానవనాలలో విహరించినట్లుగాని, కుక్కలచేత ప్రియులకు

'ఎంత పుచ్చిన మిరియాలైనా జొన్నలపాటి చెయ్యవా అన్నట్లు, కాలచక్రం క్రిందుమీదై ఒక్కొక్కప్పుడు కుక్కలబ్రతుకు అపసవ్యంగా పరిణమించినా, మొత్తం మీద వాటిది అదృష్టజీవనమే అని ఒప్పుకోక తప్పదు. ఈ ఇరవయ్యోశతాబ్దపు నాగరికత దినదినాభివృద్ధియై, మరో వందసంవత్సరాల పిమ్మట కుక్కలను నరుడి స్నేహితులుగా మాత్రమేగాక, యజమానులుగాకూడా చేసి వేయగలదు! కుక్కను చంపితే గుడికట్టిస్తేకాని ఆపాపం పోదని వున్నది మన ధర్మశాస్త్రాలలో. ఈశాస్త్రాలు మారి పోయి, నవీననాగరికతకు అనుగుణ్యంగా క్రొత్తశాస్త్రాలు నిర్మింపబడినప్పుడు కుక్కను పెంచడమే నరుడికి మోక్షసాధనమనిన్నీ, కుక్కను పూజించని వాడు రౌరవాదినరకానికి పోతాడనిన్నీ, పెంపుడు కుక్కను చంపినవాడికి మరి పుట్టగతులు వుండవనిన్నీ వ్రాయవలసి వస్తుంది!'



# రవికలగుడ్డ

నిట్టూర్పుతో రిస్టువాచీ చూసుకొని, ముఖం చిట్లించుకుంటూ, షాపునుండి వెలుపలికివచ్చి, వీధి వరండాలో ఒక్కక్షణం నిల్చున్నాడు సంజీవరావు, జేబు రుమాలుతో చేతులు, మెడ తుడుచుకుంటూ. ముచ్చెమటలు పోసి, కందినట్లు ఎర్రగా వుంది ముఖం. పెదవులట్టే కదల్చకుండా తనలో తానేదో గొణుక్కున్నాడు చికాకుతో.

ఆఫీసు పనిపాట్లు రోజూకంటె ఒకగంట ముందుగా ముగించుకొని, సాయంత్రం నాలుగుగంటలకే బయలుదేరాడు, ఇంటికి. బజారునవస్తూ, కోటుజేబులో పొందికగా మడతపెట్టి వుంచుకున్న ఎర్రని చిన్న గుడ్డపీలిక నొకసారి పైకితీసి చూసుకున్నాడు, మందహాసంతో.

'నయమే. ఒకవేళ యీగుడ్డముక్క ఎక్కడైనా జారి పోయివుంటే, నా అజాగ్రత్తకు శాంత నన్నెంత దెప్పి పొడిచేదో ?'

ఉదయం అతడు కచేరీకి బయలుదేరే ముందు భార్యయిచ్చిన పీలిక అది. 'ఈశాంపిల్ చూపించి మరీ అడగండి కొట్టువాడిని, అసక యేదో పనికిమాలిన బట్ట తెచ్చి నా త్తినికొట్టక! దీనిమాదిరిగానే నున్నగా అరుద్ర

పురుగురంగులో వుండాలి సుమండీ గుడ్డ!' అని నొక్కి చెప్పిందామె.

'సరేలే. ఆమాత్రం తెలియదనుకున్నావా నాకు? చిన్నపిల్లడికి చెప్పినట్లు బోధించి చెప్తున్నావు!' అన్నాడు సంజీవరావు నవ్వుతూ.

ఇంకా శాంత యేమో చెప్పాలని అనుకుంటూ ఉండగానే మేడమెట్లు దిగినాడాయన, కచేరీ తొందరలో! గుడ్డ ఎందునిమిత్తమని కాని, ఎన్నిగజాలది కావలెనని కాని ఆమె నడగడం మరచిపోయినాడు. సాయంత్రం ఆతడు గుడ్డకొనడానికి మొట్టమొదట బైరామ్‌షా షాపుకు వెళ్ళినప్పుడు కొట్టువాడు అడిగాడు ఆప్రశ్నలు. సంజీవరావుకు ఏం చెప్పడానికీ తోచలేదు. తటపటాయిస్తూ ఒక్క క్షణం ఊరుకున్నాడు. చివరకు ధైర్యంచేసి, 'పరుపులకోసం కావాలి, యీబట్ట!' అన్నాడు గంభీరంగా.

షాపువాడా మాటలువిని తనలో ముసిముసిగా నవ్వుకున్నాడు. సంజీవరావిచ్చిన శాంపిల్ ముక్కను పదే పదే తడిమిచూశాడు. పరుపులు, దిండ్లు కుట్టించుకుందుకు అట్టిబట్ట ఎవరూ ఉపయోగించరని చెప్పాలనుకున్నాడు. కాని మళ్లీ ఏమాలోచించుకున్నాడో, జవాబు చెప్ప కుండా తలమాత్రం ఊపి ఊరుకున్నాడు, మర్యాదగా. వ్యాపారధర్మప్రకారం షాపులోఉన్న రకాల బట్టలన్నీ మడతలువిప్పి చూపించాడు.

'సరిగా యీశాంపిల్ గుడ్డవంటి బట్టే కావాలి నాకు. ఏమంటే, ఇంట్లో కొంత బట్టవుంది, యీమోస్త

రుది. అదిచాలక—'

'అట్లానా? అయితే వాహబ్ సాయిబు షాపులో విచారించండి. మావద్ద నిన్ననే యీ స్టాక్ చెల్లిపోయింది.' అన్నాడు షాపువాడు.

షాపునుండి బయటికివచ్చి టైమ్ చూసుకున్నాడు సంజీవరావు. ఇంచుమించు నాలుగున్నర కావచ్చింది. ఆఫీసునుండి బయలుదేరి అప్పుడే అరగంట గడచిపోయిందే అని కొంచెం విసుగుకున్నాడు. పెద్దబిజినెస్ కంపెనీలో పనిచేస్తున్న తనకే ఇట్టివృధాకాలయాపనం సంభవిస్తుం దని అతడెన్నడూ అనుకోలేదు. కావలసిన గుడ్డముక్క కొనుక్కుందుకు పట్టుమని పదినిమిషాలు పట్టదనుకున్నాడు. ఎన్నిషాపులు తిరగవలసివచ్చినా సరేకాని, ఆగుడ్డ కొనకుండామాత్రం ఇంటికి వెళ్ళకూడదని మనోనిశ్చయం చేసుకున్నాడు. శూన్యహస్తాలతో ఇంటికి వెళితే యేమం టుంది శాంత? కేళిచేసి, 'మీబజారు యింతేనా?' అని యెత్తి పొడవదూ?

షాపునుండి షాపుకుతిరగడం ప్రారంభించాడు సంజీవరావు. సాయిబులషాపులు, మార్వాడీషాపులు, పార్సీ షాపులు, స్వదేశీషాపులు, విదేశీషాపు, అన్నీగాలించాడు. ఎక్కడా లభించలేదు అతనికి కావలసినబట్ట.

అలసి రోడ్డుమీద నిల్చున్నాడు కొంతసేపు ఏదో ఆలోచిస్తూ. తుడుచుకుంటున్న కొద్దీ చెమటఅధికమవు తున్నట్లు తోచిందతనకి. వుక్కకు, రోడ్డుధూళికి కళ్ళు మండినవి. పేలుడుపట్టినట్లుగా చెమటకు చిటచిటలాడ

వాడగింది తల. ధరించినది పలచని పట్టుసూటే అయినా, ఒంటిమీద ఎంతో భారంగా ఉన్నట్లు తోచింది అతనికి. కాలరుసందున చీమలు ప్రాకుతున్నట్లు అనిపించింది.

'పోనీ, రేపు ఆఫీసుకు సెలవుదినం కదా, సావకాశంగా ఉదయంపూటవచ్చి, నాలుగు కొట్లూచూసి, కొనుక్కుంటే గుడ్డ?' అనుకున్నాడు తనలో.

కాని, గడచినరాత్రి శాంతకూ తనకూ జరిగిన సంభాషణంతా అప్పుడు జ్ఞాపకమువచ్చింది.

'...మాటలవాళ్ళ దగ్గిర కొనుక్కోకుండా, నాతో చెప్తే నీకేగుడ్డలు కావలసినా తెచ్చిపెట్టనూ శాంతా? ఇళ్ళకు తెచ్చి సరుకులమ్మే వర్తకులందరూ మోసగాళ్ళని నమ్ము. రూపాయి ఖరీదైన వస్తువుకు మూడురూపాయిలడుగుతారు.'

'కాని బేరంచేస్తే, మూడురూపాయల వస్తువు సహితం రూపాయికే యిస్తారుగా?' అన్నాది శాంత నవ్వుతూ.

'నీముఖంచూసి భ్రమసిపోయి యివ్వాలి, అట్లా యిస్తే!' అన్నాడు సంజీవరావు వేళాకోళానికి.

'చాలు లెండి!' అని తల ఊపిందామె, అలక నవ్వుతో.

పెళ్ళాన్ని యెగతాళిచేసి విసిగించి కోపం తెప్పించి బుజ్జగించడం సంజీవరావుకు సరదా. శాంతఅంటే నిజంగా వెర్రిప్రేమ అతనికి. అలిగి, మూతిముడుచుకొని, ఆ లేడి కళ్ళతో ఆమె తనవేపు చురచుర చూసిందంటే ఆనం

దంతో పొంగిపోయేవాడతడు. అలకతీర్చే నెపంమీద అప్పుడు తన మోహోద్రేకాన్ని ఎంతైనా పిచ్చిగా ప్రకటించుకో వచ్చునని కాబోలు అతనిఊహ!

శాంత పందొమ్మిదేళ్ళ జవ్వని. భర్తకంటె పదేళ్లు చిన్న. మంచి యేపైనమనిషి. పొడుగుగా, తెల్లగా, అందంగా ఉండేది. తెలివితేటలతో కళకళలాడే తీరైన ఆమెవదనం. ప్రేమతో ప్రకాశించే ఆనవ్వుకళ్ళు, ఆరోగ్యంతోను యౌవనవుల్లంతోను నిగనిగమెరిసే ఆమె మెత్తని ఒళ్లు, ఆపెదవులరంగు, చెంపలనునుపు, భుజాలగుండ్రన, నడుమువొంపు, అన్నీచూసుకొని మురిసిపోయేవాడు సంజీవరావు.

ప్రేమతో చెంప నిముఋతూ, నీవంటి అమాయకుల్ని టోపీవెయ్యడం వర్తకులకు సులువు. మొన్న నువ్వు కొన్న పచ్చచీర చూశావా, ఒక్కరేవుకే రంగంతా వెలిసిపోయింది. చవకబేరమని చంకలుగుద్దుకున్నావు. పెద్దపెద్దషాపుల్లో ఏవస్తువుకొన్నా యిట్లాంటి దగా ఉంటుందామరి?' అన్నాడు సంజీవరావు.

'నిజమే కావచ్చును. కాని నాకోసమని ఆషాపులన్నీ తిరిగి బట్టలు కొని తెచ్చేవాళ్లు ఎవరున్నారని?'

'నేను లేనూ!' అన్నాడాయన.

'ఔను. మీతో ఏదికావాలని చెప్పినా చప్పునే తెచ్చియిస్తారు పాపం! నేనన్నా, నామాట అన్నా. ఎంత శ్రద్ధమీకు!' అని తల తమాషాగా ఊపిందామె, వాలుచూపులతో.

# రవికలగుడ్డ

'అన్యాయం మాటలాడకు శాంతా. ఎప్పుడైనా—'

'సరేలెండి, ఎందుకొచ్చిన తగవుయిది? రేపు మీరు కచేరీకి వెళ్లేముందు జ్ఞాపకంచేస్తానులెండి అయితే. నాకోచిన్న గుడ్డకావలసి వుంది, తెచ్చిపెట్టండి మరి నమోనా యిస్తానులెండి!' అన్నాది శాంత, మెల్లగా నవ్వుతూ.

...రాత్రిజరిగిన ముచ్చటలన్నీ తలపుకువచ్చి నవ్వుకున్నాడు సంజీవరావు. ఎంత ఆలస్యమైనా సరే. ఎన్ని చికాకులు పడవలసివచ్చినా సరే, శాంత కోరినగుడ్డకొని తెచ్చి, ఆమె మెప్పు పొందాలని అతని సంకల్పం. అప్పటికప్పుడే ప్రొద్దుపోతూ వుండెను. ఆరుగంటల తరువాత తెల్లవాళ్ళషాపులేవీ తెరచి ఉండవుకదా అని, ముందుగా అక్కడ కనుక్కుందామని బయలుదేరాడాయన. ఖద్దరు యుగానికి వెనకటిరోజులవి!

'ఇట్లా దయచేయండి, కుడిచేతి హాలువైపు' అన్నాడొక షాపులో ఒక ముసలినౌఖరు.

ప్రొద్దుపోకముందే వెలిగింపబడిన విద్యుద్దీపాలతో ఇంద్రభవనంవలె బలే రమ్యంగావుంది ఆషాపు. కందిరీగల ధ్వనితో ఎలెక్ట్రిక్ పంకాలు గిర్రునతిరుగుతూ, షాపులో వున్నవాళ్ల దుస్తులను కదల్చుచుండెను. రెండంతస్తుల దివ్యభవన మాషాపు. సరకులమ్మే ఉద్యోగస్తులందరూ గంధర్వులవంటి తెల్లజాతి యువకులును, అప్సరసలవంటి దొరసానులును.

సంజీవరావు ప్రవేశించిన హాలు అన్నిజాతుల జన

ముతోను క్రిక్కిరిసి యుండెను.

'అయ్యా, తమకు ఏమికావాలి?' అన్నా డొక షాపుగుమస్తా, సంజీవరావును చూసి.

సంజీవరావు చూపిన నమూనాగుడ్డచూసి, 'ఈ మాదిరి గుడ్డ కావాలంటే, అదిగో ఆమె నడగండి' అని ఒక గుమస్తాను చూపినాడు.

అక్కడికి వెళితే ఆమె ఆ శాంపిల్ ముక్కను ఇటూ అటూ తిరగవేసి, ముసిముసి నవ్వుతో మర్యాదగా లేదని చెప్పి, మరొక ఆడగుమస్తాను చూపింది.

'నావద్ద ముఖ్మల్ గుడ్డలు, శాటిన్లు తప్ప సిల్కులు, కాలికోలు లేవు. మేడమీదికి వెళితే దొరుకుతాయి. కాని యీ శాంపిల్ కంటె మేలైన బట్టలు చూపిస్తాను చూడండి, ఎరుపురంగులోనే' అన్నా దామె పెంకె చూపులతో.

రకరకాల గుడ్డలు టేబిలుమీద పరచిచూపింది, అతనికి. ఆమెను, గుడ్డల్నిచూస్తూ పావుగంటవరకూ అక్కడే నిల్చున్నాడు సంజీవరావు. ఏమీ కొనకుంటే బాగుండదు కదా అని తలచో, లేక ఆమె ఓరచూపులకు ముద్దుమాటలకు భ్రమసిపోయో, ఆరు గజాల ముఖ్మల్ గుడ్డ, ఏడుగజాల శాటిన్ బట్ట కొన్నాడు.

పిమ్మట మేడమీదికి వెళ్లి అడిగినాడు తనకు కావలసిన గుడ్డనుగూర్చి. హాలునుండి హాలుకు, ఆడగుమస్తా వద్దనుండి మగగుమస్తావద్దకు, మగగుమస్తావద్దనుండి ఆడగుమస్తావద్దకు తిరుగుతూ మేడ యావత్తూ గాలించాడు

కాని, ఏమీ లాభం లేకపోయింది.

అతడు చూపిన శాంపిల్ గుడ్డను పరీక్షిస్తూ ఒక గుమాస్తా, 'ఇది టర్కీ ఎరుపు. నూలుబట్టలలో యీరంగు మావద్ద ప్రస్తుతం లేదు. పట్టులోను, ఉన్నిలోను మీ చిత్తంవచ్చిన రంగులు సప్లయి చెయ్యగలం. దయచేసి ఒకటి రెండు రకాలు చిత్తగించండి' అంటూ మృదువైన మాటలతో మెప్పించి, రెండు మూడు రకాల గుడ్డలతని చేత కొనిపించగలిగినాడు.

గాజులబేరానికని సంతకువెళ్లి తుదకు గాడిదను కొని తెచ్చుకున్నట్లు సంజీవరావు ఇంగ్లీషుషాపులన్నీ తిరిగి తనకు కావలసిన గుడ్డకాక, ఏవేవో బట్టలు చాలా కొన్నాడు అనవసరంగా. భార్య యిచ్చిన శాంపిల్ వంటి బట్ట యింకే షాపులలోనైనా దొరుకుతుందేమో అని, చిన్నవి పెద్దవి ఇండియన్ షాపులు అన్నీ వెదికినాడు. తుదకు కన్నయ్యశెట్టి షాపులో కాబోలు ఎన్నో గుడ్డలు తీయించి పరీక్షించగా, తన శాంపిల్ కు యించుమించుగా సరిపోయిన ఎర్రరంగుగుడ్డ ఒకటి కనిపించింది.

'ఇది తీయించండి సామీ. నుంచి పక్కారంగు. కుంకం ఎరుపులో యింతకంటె మేలైన రంగు మరి దొరకదు. బట్టచూస్తిరా, ఎంత నాజూకుగా ఉందో? ధర జాస్తీ అని సంకోచించకండి!' అన్నాడు షాపుగుమాస్తా.

ఆ గుడ్డకూడా కొంతకొని పైకం చెల్లించాడు సంజీవరావు. అప్పటికే ఆరు గంటలు దాటింది కనుక,

యింకా బజారులో తిరగడానికి ఓపిక లేక వెంటనే జట్కా మీద యిల్లు చేరుకున్నాడు.

మగడు తెచ్చిన బంగీలన్నీ చూసి ఆశ్చర్యంతో, 'ఏమిటీ పొట్లాలన్నీ?' అన్నాది శాంత.

'నీకోసమే. విప్పిచూసుకో, నచ్చుతాయో లేదో' అన్నాడు సంజీవరావు, వస్తువులు విప్పుకుందుకు తన గది లోకి వెళ్ళిపోతూ.

కాగితాలలో పొందికగా మడతపెట్టి ఉన్న రంగు రంగులవీ, రకరకాలవీ గుడ్డలన్నీ చూసి బ్రహ్మానందభరితు రాలయింది శాంత. ఖరీదైన మంచి మంచి గుడ్డలవి. నచ్చనిదేదీ కానరాలే దామెకు. అన్నీ బాగున్నాయి! కాని, వాటిలో తానిచ్చిన నమూనా మోస్తరు బట్ట మాత్రం ఆమెకు కనిపించలేదు. అందుచేత ఆమె తనలో మెల్లగా నవ్వుకున్నది. ఒకరింటికి పసుపుకుంకానికి వెళ్ళ వలసి వుండి, ఒక గజమున్నర రవికలగుడ్డ కావలసి వచ్చింది, ఆమెకు. తెచ్చిపెడతానన్నాడు కదా అని భర్త చేతికిచ్చింది ఒక శాంపిల్ గుడ్డముక్క. ఆయన తెచ్చి నవి అవి!

రాత్రి భోజనాలప్పుడు కాని మళ్ళీ ఆ ప్రస్తావన యెత్తలేదు శాంత. అప్పుడు సావకాశంగా ప్రశ్నించింది భర్తను, అతడు తెచ్చిన గుడ్డలనుగూర్చి. ఏయే షాపులు తిరిగినాడో, ఎట్లా ఎట్లా బేరాలుచేసినాడో, ఏయేబట్ట ఎందునిమిత్తం ఎన్ని గజాలది కొన్నాడో, మొత్తం ఎంత డబ్బు వ్యయమయిందో, అన్నీ నిలువదీసి అడిగింది

అతనిని. పూసగ్రుచ్చినట్లు తాను పడిన అవస్థలన్నీ చెప్పాడు సంజీవరావు. ఇద్దరూ ఉప్పెనగా నవ్వుకున్నారు.

'అయితే గజంన్నర గుడ్డకోసం రెండున్నర గంటల సేపు షాపులన్నీ తిరిగి, తుదకు—' అని శాంత నవ్వుతో పూర్తి చేసింది మిగిలిన వాక్యం.

'నువ్విచ్చిన శాంపిల్ గుడ్డ యింత చేసింది! పోనీ, రెండు మూడు శాంపిల్సు అయినా యిచ్చి ఉంటే.....?'

'అవును లెండి. వివరంగా చెప్పకపోవడం నాదే తప్పు! కాని నిజంగా నే నిచ్చిన నమోనాకంటె మీరు తెచ్చిన గుడ్డలు వెయ్యిరెట్లు బాగున్నాయి. ఈమారు నాకేబట్టలు కావలసివచ్చినా, నా అంతట నేను చూసు కొని కొనుక్కున్నకన్న, మీచేత తెప్పించుకుంటేనే లాభం! ఒకచీర కావాలని చెప్తే, పది చీరలు వస్తాయి! కదూ?' అన్నాది శాంత ఉత్సాహంతో.

'నీ పుణ్యముంటుంది. ఈసారి మాత్రం నాకు పురమాయించకు యిట్టి బేరాలు. నీకేవి కావలసివచ్చినా నువ్వే చూసుకొని కొనుక్కోవాలి' అన్నాడు సంజీవరావు నవ్వుతూ.

---

# మేనరికము

పదిపన్నెండేళ్ళ క్రిందట రాజమహేంద్రవరంలో ఒకప్పుడు బి. ఏ. క్లాసు విద్యార్థులం కొందరం కలిసి ఒక చిన్న మోటారులాంచి కుదుర్చుకొని, పాపికొండలదాకా ఎక్స్‌కర్షన్‌కని బయలుదేరాం కిసిమ్మిసి సెలవులలో మొదటిరోజున సాయంత్రం సరికి పోలవరందాటి ఆగింది మా లాంచి. మర్నాడు కాని కొండలు చేరమన్నమాట. అందరం పడవదిగి, ఇసుకతిన్నెలమీద కొంతదూరం నడచి మంచి చదునైన ప్రదేశం చూసుకొని కబుర్లు చెప్పుకుంటూ అక్కడకూచున్నాం, యేడెనిమిది గంటల రాత్రిదాకా...మంచి వెన్నెల రాత్రులవి.

లోకాభిరామాయణం ముచ్చటించుకుంటూ, ఇసుకలో, మేం చతికిలబడేసరికి అప్పుడప్పుడే అస్తమిస్తున్నాడు, సూర్యుడు. గోదావరిమీదుగా, చల్లనిగాలి హాయి హాయి అనిపించేటట్లు వీస్తూవుంది. గలగలమని రాళ్ళమీదుగా కెరటాలతో ప్రవహించే నీటి చప్పుడు వినరాలేదు, మా మాటల కోలాహలంలో. మా అర్థంలేని నవ్వులతోను, అనవసరమైన కేకలతోను, అపస్వరాల పాటలతోను, శుష్కవాదాలతోను, నదిని, గాలిని, పక్షులను, బెదరగొట్టి నోరు మూశాం కొంతసేపు.

# మే న రి క ము

లోకం తిప్పి తిరగవేసి, భూమీఆకాశం ఒకటిచేసి, ఎక్కడెక్కడివో ఎన్నెన్నో సంగతులు నిర్భయంగా సావకాశంగా తృప్తితీరా చర్చించుకునేందుకు అవకాశం దొరికిందినాకు. పోలిటిక్సునుగూర్చి, ఆడవాళ్ళనుగూర్చి, మా కాలేజీ ప్రొఫెసర్ల లోటుపాట్లనుగూర్చి, చదువు ముగిసిన తరువాత మాలో ఎవరెవరు ఏయే ఘనకార్యాలు చెయ్యడానికి సంకల్పించుకున్నారో...వాటినిగూర్చి స్వేచ్ఛగా, మా మా అభిప్రాయాలను ప్రకటించుకున్నాం. మా సంభాషణకు ఒక విషయ నియమం కాని, కాలనియమం కాని, లేవు. ఎవడికెప్పుడు యేసంగతి చెప్పాలని తోస్తే అది చెప్పడమే!

ఏ సందర్భములోనో మొదట ప్రకాశం కాబోలు ప్రారంభించాడు—ప్రేమతత్వంమంటే స్వానుభవం వలన తానేవిధంగా అర్థం చేసుకున్నాడో...అది కొంత వివరంగా ముచ్చట్లతో చెప్పడానికి. ఆ పిమ్మట, వేలం వెర్రెత్తినట్లు, ఒకడి తరువాత ఒకడు. యెవడి స్వీయ చరిత్రలోని ప్రణయగాధలు వాడు చెప్పడం ప్రారంభించాడు. ఒకడి కథకంటె ఒకడిది రక్తిగా వినవచ్చింది. నీకంటె తక్కువ తిన్నవాడెవడిక్కడ? అన్నమోస్తరుగా ప్రతివాడు అద్భుతంగా అబద్ధాలు కల్పించి బడాయిలు చెప్పడానికి మొదలు పెట్టినాడు. ఎవడుచెప్పినకథను కూడా ఎవడూ నమ్ముకొని ఉంటాడని తోచదు మాగుంపులో, ఆత్మశ్లాఘన పరనింద ప్రతి కథలోను విస్పష్టంగా విశదపడేవి. మొత్తంమీద, యీ కథలన్నిటిలోను తేలిన

సారాంశం, ఒక్కటే. అదేమిటి అంటే, 'ఆడది చపల చిత్తురాలు; ఎంత మర్యాదైన యింట్లో పుట్టినదైనా ఏ కులందైనా, ఎంత చదువుకున్నదైనా సరే, మగవాడిని దుర్నీతికి, ప్రేరేపించి, చెడగొట్టాలని యత్నిస్తుంది. వయసు తేడాలు, వావివరుసలుకూడా, పాటించదు. అవసరమున్నా లేకపోయినా తొణుకుబెణుకూ లేకుండా అన్నీ అబద్ధాలే చెబుతుంది!—ఇక పురుషుడట్లా కాదు. మహా దొడ్డవాడు. ముఖ్యంగా, కాలేజీలలో ఉన్నత విద్యలు నేర్చుకుంటున్నవాడైతే మరీదొడ్డవాడు! ఎప్పుడూ సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రునివలె నిజమే పలుకుతాడు. గట్టి యింద్రియనిగ్రహం గల ప్రతాపవంతుడు. నీతి, పాప భీతీ తెలివితేటలుగల సుగుణమూర్తి. అయితే, ప్రమాదో ధీమతామపి, అన్నట్లు పురుషుడొక్కొక్కప్పుడు స్త్రీల మాయలకు లొంగిపోయి అజ్ఞానకూపంలో పడిపోతూ ఉండడంకూడా కద్దు—విధి వ్రాత తప్పించుకుందుకు సాధ్యంకాని విషమపరిస్థితులలో, మగవాడి ప్రవర్తన ఎన్నడూ నిందార్హము కానేరదు! అని.

ఒక్కొక్కడు తన ప్రణయప్రతాపాలు ఉత్సాహంతో వర్ణిస్తూ ఉంటే వొళ్లు మండుకొచ్చేదినాకు. ఎవడి మట్టుకు వాడు తానొక ప్రవరాఖ్యుడుగా సారంగధరుడుగా చిత్రించుకునేవాడు. కథలో నేరమంతా నాయకిమీదనే తోసి ఆమెనుగూర్చి విపరీతమైన అన్యాయాలు చెప్పేవాడు. ఆడదాని శీలాన్ని పీలికలక్రింద చించి మట్టిలో పొర్లించి అసహ్యాకరంగాచేసి చూపించేవాడు.

# మే న రి క ము

అంతకంతకూ యీ కధకుల ధోరణి...సుతిమించి రాగానికి వచ్చింది. వాళ్ళు చెప్పే అసందర్భాలు వినడానికే సిగ్గు వేసిందినాకు. నాకు దగ్గరగా కూచుని ఉన్న విశ్వనాథం మెల్లగా నాతొడమీద గోకినాడు. నావలెనే వాడికి కూడా, ఒళ్లు మండుతూ వుందని వెంటనే గ్రహించాను. అయితే మనసులో రగిలేమంటను నావలె మనసులోనే అణచుకునే స్వభావం కాదువాడిది. కోపంవస్తే యింద్రుణ్ణి చంద్రుణ్ణి కూడా లక్ష్యపెట్టడు. నోటికివచ్చినంత మాటా, అని తీరుతాడు. కాని వాడు బూతులు తిట్టినా వైదీకంగా తిట్టడు. తమాషాగా గూడార్థాలతో తియ్య తియ్యగా చక్కెరపాకంతో కప్పబడిన క్వైనైన్ మాత్రలవలె ఉంటాయి వాడితిట్లు!

అయినా మనంలో మనకు లేనిపోని కలహాలెందుకు పోనిస్తూ...ఊరుకో అని సలహా యిద్దామనుకున్నాను. ఈలోపునే వాడప్పుడే లేచి నిల్చున్నాడు—సభాసదుల యెదుట ఠీవిగా నిల్చునే హరిదాసువలె. అందరూ తలలు పైకెత్తి ఏం చేస్తాడో అని ఎదురుచూస్తూ విశ్వనాథం వేపు దృష్టినిగిడ్చి మాటామంతీలేక నిశ్శబ్దంగా కూచున్నారు.

గుంపులు గుంపులుగా శాఖలుతీర్చి కిలకిలారావంతో అంతరిక్షాన యెగురుతూ వున్న కొంగలరెక్కల చప్పుడు దూరంనుండి వినవచ్చే ఏరోప్లేన్ ధ్వనివలె జువ్వున వినవస్తూవుంది. చుక్కలకోసం నిరీక్షిస్తున్న వాడివలె చలనంలేక ఒక్కచోటనే ఆగిపోయినట్లు కనిపిస్తున్నాడు

శుక్లపక్షచంద్రుడు. ఉత్సాహంతో పిల్లగాలులతో కలిసి నాట్యంచేస్తున్నట్లు వెండిమువ్వల ధ్వనులతో ప్రవహిస్తూ వుంది, గోదావరి. మబ్బులేని స్వచ్ఛమైన ఆకాశం, విశాలమైన మెత్తని యిసుకతిన్నెలు దూరంనుండి మసక మసకగా కనబడే నీలికొండలు, అద్దంవలె తళతళలాడుతూ వున్ననది దివ్యమైనగాలి.

ప్రకృతిలో అన్నీ ఆత్మకొక విధమైన శాంతి నొసగే రమ్యమైన సంధ్యాసమయమది!

'నాకుకూడా ఒక చిన్న ప్రేమముచ్చట చెప్పాలని కుతూహలంగా వుంది; చెప్పనా?' అన్నాడు విశ్వనాథం చిరునవ్వుతో.

చెప్పమని అందరూ ప్రోత్సహించిన పైని ఒక్కక్షణం ఊరుకొని ముఖం గంభీరంగా పెట్టి ప్రారంభించాడు యీవిధంగా.........ఇంటర్ పరీక్షకు విజయనగరం వెళ్ళడంనుంచే ఈ ముప్పులన్నీవచ్చాయి. లేకపోతే మహారాజులాగు......కాని యిప్పుడువగచి యేంలాభం? పరీక్షపోయినందుకు నాకంతగా విచారమునిపించలేదు. కాని బంగారంలాంటి మేనరికం వదులుకోవలసి వచ్చింది కదా అని మనసు చాలా క్షోభించింది. నాదిగాక దురదృష్టం!

ఉన్న ఊరు, చదువుకున్న కాలేజీ విడిచి మరో చోటుకు వెళితేమాత్రం పరీక్షలో కొత్త తెలివితేటలు పుట్టుకొస్తాయా యేమిటి? అదో భ్రమ. కేవలం పరీక్ష కోసమని పరాయిస్థలం వెళ్ళడమనేది బుద్ధితక్కువ పని.

# మేనరికము

నీరు, గాలి, భోజనం, యిల్లు, మనుషులు—అన్నీ కొత్తే, అంతా మార్పే! 'అదే ప్రతకమైతే అమ్ముకోనే బ్రతక్కనా?' అని, నాకే గొప్ప తెలివితేటలు, దూరాలోచన, సాధక బాధక విచక్షణవుంటే. యీ గ్రహచారమేం?

—విజయనగరంలో అప్పుడు మా మేనమామగారొకరుండేవారు— అంటే, గతించిన మా సవతి తల్లి యొక్క అన్నగారు. ప్రథమ కళత్రసంతానం ఆయనకు ఒక్క కూతురు మాత్రం మిగిలింది. మంచి యోషైన చక్కని పిల్ల. పది పన్నెండేళ్ళది. రెండో భార్యకింకా సంతానం లేదు. కూతుర్ని నాకిచ్చి మేనరికం చెయ్యాలని మామామ సంకల్పం. మావాళ్ళుకూడా నాకూ సుభద్రకే పెళ్ళి నిశ్చయమైపోయినట్లే భావించుకునేవారు. పిల్ల యోపరి గనక, శీఘ్రంలో వివాహం చెయ్యకపోతే యేం ప్రమాదం వస్తుందో అని అందరికీ భయం. నాపరీక్షలు అయిపోయిన తరువాత, ఎండాకాలంలో వివాహ ముహూర్తాలున్నవిగనుక అప్పుడు చెయ్యవచ్చునను కున్నారు పెళ్ళి.

పరీక్షలకు ముందు ఒక నెలరోజులైనా వ్యవధి వుండగా అక్కడికి రావలసినదని మా మామ గట్టిగా వ్రాశాడు నా పేర. అందుచేత వో పదిహేనురోజులు ముందుగానే బయలుదేరాను విజయనగరానికి. చదువుమాటకేంగాని నా కాబోవు భార్యతో కొంతపరిచయం, చనువు, కలుగ జేసుకోవచ్చునుగదా అని సంబరపడ్డాను. తీరా అక్కడికి వెళ్ళినతరవాత ఆ అమ్మాయి విజయ

నగరంలోనే లేదని తెలిసింది. వాళ్లు అమ్మమ్మగారి ఊరు వెళ్లిందట.

మా మామ కాపురమున్న యిల్లు చిన్నదైనా శుభ్రంగా, విశాలంగా ఉండేది. మంచిగాలి, వెలుగు, నిశ్శబ్దం—చదువుకుందుకు చాలా యోగ్యంగా ఉంటుందని సంతోషించాను. రమ్యమైనగాలి, పువ్వుల మొక్కలు, చెట్లనీడ, చదువుమాట దేవుడెరుగునుగాని, హాయిగా నిద్రపడుతుంది. దోమలు తక్కువ. టేబిలు, కుర్చీ, బీరువా, పట్టెమంచం,—ఏర్పాటులన్నీ బాగున్నాయి.

మా మామ, అత్త, యిద్దరూ కూడా నన్ను చాలా అభిమానంతో చూసేవారు, నా సదుపాయాలు చూస్తూ, మంచి మంచి ఫలహారాలు, పళ్లు, కాఫి, షర్బతులు. సోడా, తమలపాకులు, యేమీ లోటులేకుండా చేశారు. నాపరీక్షలింకా వారంపదిరోజులకు జరుగుతాయనగా, మా మామ విశాఖపట్నం వెళ్లవలసివచ్చింది. అక్కడ కోర్టులో యేవో దావాలున్నాయనీ, ఆ వ్యవహారాలు వారంరోజులలో తెమిలిపోవచ్చుననీ, వెంటనే తిరిగివచ్చేస్తాననీ చెప్పి వెళ్ళినాడు.

రైలుకు బయలుదేరేముందు మా మామ తన భార్యతో 'ఒసే కనకం, పోయివస్తాను. సాధ్యమైనంత త్వరలో—వారంలోపునే వొచ్చేస్తాను. కాదు పోదంటే మరో రెండురోజులవుతుంది. మావిశ్వం భోజనానికీ,దానికీ కొంచెం మొగమాటం పడతాడేమోసుమీ. వాడికి నీదగ్గిర చనువుతక్కువ. అంచాత, కొంచెం కనిపెట్టి

చూస్తూ ఉండు. ముసలిదానికి యేమీ తెలియదు. ఆచారం
గొడవలోపడిపోయి వంట ఆలస్యం చేస్తుందేమో? నువ్వు
గట్టిగా చెప్పి పరీక్షరోజులలో తొమ్మిది గంటల లోపునే
వంట చేయించాలి.' అని చెప్పాడు.

'నాకుమాత్రం తెలియదటండీ? కాబోయే అల్లుడు
కదా! మీరింత నొక్కి చెప్పనక్కరలేదు. మీకు ఎప్పు
డైనా అతడు మేనల్లుడే, నాకో? కొత్తల్లుడు. అల్లుడికి
మర్యాదచెయ్యడం అత్తగారికి చెప్పనవసరంలేదు.' అని
నవ్వుతూ బదులు పలికిందామె.

మా మామ ఊరికి వెళ్ళినదిలగాయతు నిజంగా
మా అత్తకు నామీద అభిమానం పదిరెట్లయి పరిణమిం
చింది. నా భోజనం ఏర్పాటులో నేమి ఫలహారాలలో
నేమి, యేమాత్రం లోటురాలేదు, నాకుకూడా ఆమె
యెడల గౌరవం, చనువు, దినేదినే అధికమైనాయి.

పరీక్షలింకా రెండురోజులకు ప్రారంభమవుతాయను
నగా కష్టపడి చదవడం మొదలుపెట్టాను. కాని రోజుకు
రోజుకు ఆకలి నిద్ర మాత్రం జాస్తిఅవుతున్నట్లు తోచింది.
తలదిమ్ముగా ఉంటే నాడు సీకాయతో తలంటుకొని నీళ్లు
పోసుకున్నాను. మధ్యాహ్నం భోజనానంతరం చదువుకుం
దుకు పుస్తకం పట్టుకొని మంచంమీద పడుకున్నాను,
భుక్తాయాసంతో, చదువుతూ ఉండగానే క్రమంగా కళ్లు
మూతలు పడ్డాయి, ఎండ తీవ్రంగావున్నా చల్లనిగాలి
వీస్తూవుండబట్టి హాయిగా నిద్రపట్టింది.

లేచేసరికి పుస్తకం నాగుండెమీదనేవుంది. మా

అత్తగొంతుక విని కళ్లు తెరిచాను. ఎందుకో ఎవరినిగూర్చో గట్టిగా కోపంగా మాట్లాడుతూ ఉన్నట్లు వినిపించాయి ఆమెమాటలు ఆమె సరీగా యేమంటున్నదీ వెంటనే నాకు బోధపడలేదు. మేలుకొని ఉన్నానా, లేక కలగంటున్నానా, అని మొదట సందేహం కలిగిందినాకు.

'ఏమోయి, బాగానేవుంది'... ఇందుకా యేమిటి నువ్వీ ఊరువచ్చింది?—ఇంకా నయం. ఇంట్లో నేనే ఉన్నాను గనక సరిపోయింది. మీ మామే ఉంటే?'

వెంటనేలేచి కూచున్నాను ఆమె ముఖం చూస్తే భయం వేసిందినాకు. కాని ఆమె కళ్ళలో మెరిసేది కోపమో, కొంటెతనమో, బోధపడలేదు నాకు. సరే, చముఫ్రకుందాక మూరు కాళ్లు నిగపదన్ని గుర్రు తీస్తూఉండడం కనిపెట్టి నన్నిమె కూకలువేస్తూ ఉంది, అనుకొని, 'అత్తా కునుకు ఎట్లా పట్టిపోయిందో కాని నిద్రపోదామని నేను అనుకోనేలేదు,' అని సమాధానం చెబుతూ మెల్లగా నవ్వినాను.

'నవ్వేస్తే సరిపోతుందనా? చనువిచ్చి ముద్దుచేస్తున్నానని కాబోలీధైర్యం?...ఎంతమాట! ఎవరైనా వినివుంటే ఎంత అపకీర్తి ముచ్చట! సమయానికి కాఫీతీసుకొని నేనేవచ్చాను కాబట్టి సరిపోయింది. ఇంకా నేను రాకముందు ఏమంటూ వుంటివో కదా?' అంటూ ఆమె కాఫీగ్లాసు ఉపమాపళ్ళెం టేబిలుమీద పెట్టి నాదేపు తిరిగి గద్దించడం ప్రారంభించింది.

తెల్లబోయిచూస్తూ నేను దీనంగా 'అత్తా,

ఎందుకు కోపగిస్తావు? నేనేమన్నాను?......ఎవరిని?...
...ఎప్పుడు?......' అని అడిగాను.

'ఏమన్నావా?......కుదిరింది!' అని తల తమా
షాగా ఊపుతూ మెల్లగానవ్వి 'ఆమాటలన్నీ నానోట
మళ్ళీ చెప్పించాలని ముచ్చటగా ఉందా నీకు? నువ్వంటే
మొగవాడివి గనుక సిగ్గుపడనక్కరలేదు. నన్నుకూడా
స్త్రీస్వభావమైన లజ్జ, బిడియం విడిచిపెట్టి ఆమాటలన్నీ
అనమన్నావూ? బాగానే ఉంది! క్రిందటికేనో మనవాళ్లు
సామెత చెప్పినట్లు—' అని యింకా యేమో చెప్ప
బోయింది.

'అత్తా! ఇంతకు నేనుచేసిన నేరమేమిటోకూడా
చెప్పకుండా నామీద కేకలువేస్తే యేందారినాకు?'

'ఔను పాపం! ఏమీ యెరగని పసిపిల్లడివి. బుగ్గ
చూపినా ముద్దులాడనేరని అమాయకుడివి. అంత అమా
యకుడవుగనుకనే నేను గదిలోకివస్తూ ఉండడం కనిపెట్టి
అదివరకల్లా చదువుకుంటున్నవాడివి పుస్తకం క్రిందపడేసి
నిద్రపోతున్నవాడివలె కళ్లుమూసుకొని ఏదో కలలో పలవ
రిస్తున్నట్లు నీమనసులో ఉన్న నాలుగుమాటలూ నాకు
వినబడేటట్లు అర్థమయేటట్లు అనేశావు.' అని కొంతసేపు
ఊరుకొని మరల 'నీ మాయమాటలకు భ్రమసిపోయి, నీ
యౌవనం అందం చందం అన్నీచూసి, వావివరస లక్ష్య
పెట్టక, నిన్ను ప్రేమిస్తున్నాను గనుక నీకోర్కె తీర్చక
పోతానా అనుకున్నావుకదూ! మీ మామ ఊరికి వెళ్ళడం
ఇంట్లో ఉన్న ముసలిముండ పురాణం వినడానికి వెళ్ళడం,

అన్నీ అనుకూల్యంగా తటస్థించాయనా?.....ఇట్టి విపరీతపు తలంపు నీలో ఏదోవున్నదని యిదివరకే అనుమానించాను నేను. అయితే యింతధైర్యం వహిస్తావని అనుకోలేదు,' అన్నది.

ఇదేమిటిరా దేవుడాఅని నిర్ఘాంతపడి ఆమెవేపు అట్టేచూసి 'అత్తా నీమాటలు నాకేమీ బోధపడడం లేదు. నిద్రలో నేనేమైనా తెలివితక్కువ మాటలు కలవరించానా ఏమిటి? ప్రమాణంచేసి చెప్తాను. నామాటనమ్ము. ఒంటిమీద స్మారకం లేకుండా పడుకున్నాను. నువ్వు గదిలోకి రావడం నేనేమీయెరగను. నిద్రలో నేనేమైనా తప్పుమాట లాడిన వేళ అనిప్పుంటే నీపాదాలుపట్టుకొని వేడుకుంటాను. క్షమించు.' అని లేచి నిలుచున్నాను.

'ఈ చమత్కారం మాటలకెక్కడికిలే? ఆడవాళ్ళ మనసు మెత్తనకదా అని నువ్వేంచేసినాసరే నీమీద మోహంకొద్దీ ఊరుకుంటాననుకున్నావుకదూ ? మీ మామయ్యతో యివన్నీ చెప్పలేనుకదా అని నీధైర్యం ! హుం?.....ఆయనమీద నాకు ప్రేమ ఎంతలేకపోయినా, నీలో యెంత రసికత్వం చక్కదనం నాకళ్ళకు కనబడినా, నీతికి దానికి నేనెంత భయపడనిదానినైనా, సూచాయాచా నీమనసులో ఉన్నకోరిక గ్రహించుకున్నంతమాత్రాన తొణుకూబెణుకూ లేకుండా పిలిచేపిలవడంతోవచ్చి నీ కౌగిట్లో వాల్తాననుకున్నావా ? నీకళ్ళకు నేనంత చులకనగా కనిపిస్తున్నానేం ? నీతో కాస్త చనువుతో ప్రవర్తిస్తున్నందుకా...? ధైర్యం, సాహసం పురుషలక్షణాలే

కావచ్చును, కాని నావంటి యేమీచేతగాని బాలిక మీదనా? అసహాయురాలనని అబలనని అదును చూచుకొని నన్ను నిర్బంధించడం ధర్మమేనా? నువ్వు కుర్రవాడివనీ, యింకా చిన్నతనం కాబట్టి యేమీ తెలియదనీ సమాధానం చేసుకొని నీ పెంకెమాటలకీ ప్రేమచూపులకీ అన్నిటికీ ఓర్చి ఊరుకుందామంటే మౌనం అర్థాంగీకారసూచనగా యెంచి నువ్వింకా యేం దుడుకుపనికి తెగిస్తావో అని భయం వెయ్యదూ? మోహంలో వున్నవాళ్ల చేష్టలు విపరీతంగా ఉంటాయని నేనూ యెరుగుదును. కాని కామోద్రేకంతో మన్ను మిన్ను కానక పట్టపగలు నిర్భయంగా యింట్లో ఎవరూ లేరుకదా అని, నామనసులో ఎట్లా ఉంటుందో అన్నైనా సంకోచించక శ్రీకృష్ణుడికి రాధవలె నేను నీకు అత్తవరస కాబట్టి పురాణాలుకూడా ఒప్పుకుంటాయని మనసు సమాధానం చేసుకొని యీవిధంగా నన్ను నిర్బంధించి బురుడు చేసి ఒప్పించి వశపరచుకుందుకు యత్నించడం మహావిపరీతం--అన్యాయం--ఘోరం'

ఉద్రేకంచేత మాటలు తడబడుతూ ఉండడం గ్రహించుకుని ఒక్కక్షణం ఆగి, ముసిముసినవ్వుతో మళ్లీ ప్రారంభించింది. 'నేను చక్కగా ఉండడం నాతప్పు కాదు కదా? దేవుడు ఎవరినెట్లా చేస్తే వాళ్లు ఆవిధంగా ఉండక తీరదు. అందంగా ఉన్నానని నన్ను నిలువునా కళ్లతో తాగేగలవా యేమిటి? నీమోహంలో నన్ను ముంచేసి లాలించి ఊపిరాడకుండా ముద్దులతో నోరుమూసి ఉక్కిరి బిక్కిరి అయేటట్లు వశానికి అదిమి కౌగలించుకొని

ప్రేమోద్రేకంతో నన్ను మత్తెక్కించి మైమరపించి కీలు బొమ్మని చేసి ఆడిద్దామనా నీసంకల్పం? నిజంగా నువ్వు దేనికి పురికొలిపితే అందుకు ఒప్పుదల అవుతాననే అనుకున్నావూ? మన యిద్దరికీ యీడు జోడు ఎంత సరిపోయినా ఒకరిమీద ఒకరం మనసు ఎంత పట్టలేకపోతూవున్నా ఇట్టి అవకాశం లభించినందుకు లోలోన యిద్దరం ఎంత సంతోషిస్తూ ఉన్నా, మీ మామ ముసలివాడై కూడా నన్ను పెళ్ళాడినందుకు తగినశాస్తి కావలసిందే అతనికని యిద్దరం మనసులో ఎంత అనుకుంటూ ఉన్నా వేళా, పాళా, బిడియం, భీతి, ఉండవద్దూ?'

నావొళ్ళు జల్లుమన్నది. నిద్రమగత పూర్తిగా వదిలింది. మొట్టమొదట మాఅత్తమాటలు, గద్దింపు, యేమీ బోధపడలేదు కానీ, క్రమంగా సంగతి విశదపడింది. నిద్రలో నేనేమీ కలవరించి ఉండలేదని స్పష్టమయింది. అదంతా ఆమె కల్పన. చిత్రం! మనిషిని బెదరగొట్టి ప్రేమింపజేయనెంచిన స్త్రీలను కథలలోనైనా ఎన్నడూ విని ఉండలేదు. మాఅత్తచర్య విచిత్రంగా విపరీతంగా కనిపించింది నాకు. నాహృదయంలో కోపం, జాలి, నవ్వు, ఏడుపు, ఆశ్చర్యం, అసహ్యం, బెంగ, బిడియం, అన్నీ ఒక్కసారి రగులుకున్నాయి. ఏమనడానికీ తోచలేదు నాకు. వెనకటి కెవరోరాణి గాడిదనుచూసి మోహించిందన్న షేక్స్పియర్ కథ జ్ఞాపకంవచ్చి నాలో నేను నవ్వుకున్నాను.

మాఅత్తకు నామీద ప్రేమాతిశయం కలగడానికి

కారణం ఏమిటి చెప్మా అని ఆలోచించాను. నేనేం మన్మథుడననా ? అద్దంలో చూసుకొని నా బాహ్యక రూపానికి నేనే చిన్నబోతూ ఉంటానే ! పుస్తకాలలోను, కథలలోను, ప్రేమతత్వం విపరీతవిధాలగా కనిపిస్తుంది నిజమే. కాని, ఏ నాయకి యెవడిని వరించినా ఆనాయకుడు మాత్రం కురూపిఅనీ, ముద్దు పెద్దమ్మ అనీ ఎవరూ వర్ణించి ఉండలేదు గ్రంథాలలో. అప్రయత్నంగా అనేక దృష్టాంతాలు జ్ఞాపకం వచ్చాయి—రాధాకృష్ణులు, మేనకా విశ్వామిత్రులు, వరూధినీప్రవరులు, చిత్రాంగీసారంగ ధరులు, తారాచంద్రులు మొదలైనవి. నాయకుడు వేడుకున్నప్పుడు నాయకి నిరాకరించడం, నాయకి వేడుకున్నప్పుడు నాయకుడు నిరాకరించడం యిద్దరూ ఒకరినొకరు నిరాకరిస్తున్నట్లు నటించి తుదకు కలిసిపోవడం—అనేక రకాలుగా ఉంటుంది ప్రేమతత్వం. కాని మాఅత్తమోస్తరుగా తూలనాడుతూ మోహం వెలిబుచ్చిన నాయకి యెక్కడా లేదు ?

ప్రస్తుతం నాకొచ్చినముప్పు తప్పేసాధనం యేమిటా అని దీర్ఘంగా ఆలోచించాను. మాఅత్త ధోరణిచూస్తే నాకేమీ పాలుపోవడంలేదు. ఆపాదమస్తకపర్యంతం నావొళ్లు వణకడం ప్రారంభించింది. ఏదో భయంవేసి గుండె దడదడలాడడం, ఏమో అనబోయి నోటమాట రాక నాలోనేను గుటకలువెయ్యడం, ఈవిధంగా పరిణమించింది నాఅవస్త మొగంయెత్తి ఆమెవేపు చూడలేకపోయాను. ఆక్షణంలో నిజంగా నాకంటె కామె ఒక

పెద్దపులివలె కనిపించింది.

నాకు నమ్మకంవున్న దేవుళ్ళకీ, దెయ్యాలకీ అందరికీ మనసులో మొక్కుకున్నాను యీగండం గట్టెక్కించమని. వశీకరణమంత్రాలనీ, మందులనీ, ఏవో ఉంటాయనీ యెరుగుదును కాని, మనని ఒకరు ప్రేమించకుండా చేయగల సాధనాలేవీ ఉన్నట్లు నే నెన్నడూ విని వుండలేదు. నిష్కారణంగా మాఅత్తకు నామీద మనసు కలిగింది. నాకుమాత్రం ఆమెయెడల అట్టిభావం ఎన్నడూ లేదు. నేను రవ్వ, రొష్టుపడకుండా ఆమెకు మనసు బాధించకుండా యీఅవాంతరం దాటి అవతలపడే ఉపాయమేమిటా అని ఆలోచిస్తూ నిల్చున్నాను.

మా మామ ఊరికివెళ్ళినదగ్గిరనుంచి మాఅత్త నామీద చూపుతూవచ్చిన దయకల్లా కారణం యిప్పుడు బోధపడింది. చనువుచేసుకొని నాతో సరదాగా ఉంటూ ఉందికదా అని సంతోషించానేకాని ఆమె మనసులో యిట్టి వెర్రితలంపు పుడుతుందని కలలోనైనా అనుకోలేదు. నన్నుచూసి అప్పుడప్పుడామె ముసిముసినవ్వు నవ్వడం—సందుదొరికినప్పుడల్లా నన్ను వేళాకోళం చేస్తూ మళ్ళీ యేమీ అనుకోవద్దని బుజ్జగించడం—చనువుతో నవ్వుతూ భుజంమీద వెచ్చగా తట్టడం—మంచి మంచి ఫలహారాలూ అవీ మేపడం—రాత్రి నేను చదువుకుంటూ వున్నప్పుడు చప్పుడుచేయకుండావచ్చి కుర్చీ వెనక నిల్చుని కొప్పులో ఉన్న మల్లెపువ్వుల వాసనతో గుమగుమలాడుతూ నాభుజంమీదనుండి వంగి టేబిలుపైనున్న

వాచీని చూపుతూ 'తొమ్మిది దాటిందికదా ఇంకా చదు వేమిటి? నిద్రరావడంలేదూ?' అంటూ వెనక్కితిరిగి 'తోటలోకి వెళ్ళాలి; నాకు సాయంరావూ? పెరట్లో పందిరికి చీర ఆరగట్టి మరచిపోయినాను. ఎంత వెన్నెలగా ఉన్నా ఒక్కర్తెనే వెళ్ళడానికి భయంవేస్తుంది.' అని నన్ను బలవంతంచేసి మల్లెపందిరి దగ్గిరికిరమ్మనడం– అక్కడికి వెళ్లిన తరవాత 'ఈతోటలో యింతహాయిగా ఉన్నా కుండా ఉక్కపోస్తూ ఆగదిలోనే కూచుంటా నంటావేం? ఈవెన్నెల, యీపువ్వులు, యీగాలి, యీనిశ్శబ్దం ఈచల్ల దనం ఏవీ అనుభవించాలని ఉండదూ నీకు' అంటూ మంట పంమీద చతికిలబడి నన్ను దగ్గిర కూచోమనడం– ఇవన్నీ యిప్పుడు అర్థమవుతున్నాయి. నాది అదెంత మట్టిమెదడో కాని సుతిమించి రాగానికి వచ్చేదాకా అసలుసంగతి కని పెట్టనేలేకపోయాను. నామనసులోకూడా యేదైనా దురుద్దేశం ఎప్పుడైనా అంకురించి ఉంటే నిశ్చయంగా ఆమె ప్రవర్తనను అర్థంచేసుకోగలిగి ఉందును.

తుదకు నా బేలతనానికి విసుగెత్తి కాబోలు యీ విధంగా కసుర్లతోను చీవాట్లతోను ఉన్న నిజం తెలియ జేసింది. ఆమె యింత స్పష్టంగా తన హృదయం వెల్లడి చేసినా నేను బెల్లంకొట్టిన రాయిలాగు మాట, మంతి, లేక నిల్చోడం చూసి మూఅత్తకు కోపం, దుఃఖం ముంచుకొ చ్చాయి. కేవలం శుంఠను కాకపోతే తక్షణం ఆమెను అమాంతంగా కౌగలించుకొని ప్రేమసుఖం అనుభవించి ఉండనా, అనుకొని ఉంటుంది! మతిపోయినవాడివలె

నిల్చొని నేను గుటకలుమింగుతూ ఉండడం ఆమెకు మనస్క-
రించలేదు. తానంత బయలుపడి ప్రతిమాలుకుంటూ
ఉన్నా, అనవసరంగా నేను మూర్ఖతవహించి, మారు
ప్రేమచూపకపోవడమనేది ఆమెకు చాలా ఆశ్చర్యంజొనిపి
ఉంటుంది. ఒక్కక్షణం నావేపు దీనంగా, కోపంగా,
విచారంగా, అసహ్యంగా చూసి, దీర్ఘమైన నిట్టూర్పు
విడచి వెనుదిరిగి వెళ్ళిపోబోయింది.

అప్పుడు నేను తటాలున ముందు కొక అడుగువేసి
ఆమె రెండుచేతులూ పట్టుకున్నాను, క్షమాభిక్ష వేడు
కుందుకు. ఆమె హృదయంలో రగులుతూ ఉన్నబాధ
ఆ మెరుపుకళ్ళలో ప్రతిఫలిస్తున్నట్లు తోచింది నాకు.
ఆమె నావేపు బరపిన చివరచూపు నాగుండెకు చురకత్తి
వలె తగిలింది. పిచ్చెత్తినట్లయింది నాకు. దుఃఖం వచ్చింది.
ఎట్లయినా సమాధానపరచి కాళ్ళూ జేతులూ పట్టుకొని
ఆమె మనసును మరలించి యీఅవాంతరం దాటాలని
నిశ్చయించుకున్నాను. వెచ్చగా తగిలాయి నా కామె
చేతులు.

ఆమెచేతులు నేనట్లా తటాలున పట్టుకోవడంలో
నాఉద్దేశం ఆమె తిన్నగా గ్రహించుకుందో లేదో కాని,
'బలేవాడవు మొత్తానికి! నీపంతం నెగ్గించుకుంటున్నావు.'
అంటూ తల పక్కకువాల్చి ఓరచూపులతో మెల్లగా
నవ్వుతూ ఉత్సాహంతో నన్ను అమాంతంగా తనవైపు
లాగుకుంది!

ఇంతట్లో గదిగుమ్మంవద్ద ఏదోచప్పుడు వినవస్తే

తృళ్ళిపడి ద్వారంవైపు చూసిందామె. నల్లత్రాచును త్రొక్కినట్లుగా, దయ్యాన్ని చూసి జడిసినట్లుగా భీతాహంతో వణికింది, అప్పుడామె వొళ్ళు. చూస్తూఉండగానే ఊసరవల్లివలె చిత్రంగా అంతలో మారిపోయింది ఆమె ముఖవైఖరి. నిమిషంక్రిందట ఆమె వదనమందు తాండవించిన ముసిముసినవ్వులు, ముద్దుకోపం, ప్రేమచూపులు, అన్నీ హఠాత్తుగా మాయమైనాయి. కళ్ళంట నిప్పులు రాలుస్తూ శత్రుసంహారార్థం అవతరించిన మహిషాసుర మర్దనివలె పొడగట్టింది, ఆముహూర్తంలో నాదృష్టి కామె! తటాలున విడబడి నన్ను తననుండి వెనుకకు తోస్తూ కోపంతో చెయ్యెత్తి చప్పుడయేట్లు గట్టిగా చరిచింది నాదవడమీద!

చెంప చుర్రుమన్నది నాకు. గూబ గింగురుమన్నది. ఒక్కక్షణం కళ్లు చీకట్లు క్రమ్మినట్లనిపించింది. నిర్ఘాంతపడి నిల్చున్నాను నోటమాటలేక.

నావేపు, మాఅత్తవేపు ఆశ్చర్యంతో పిచ్చివాడివలె చూస్తూ గుమ్మంలో ప్రత్యక్షమైనాడు మా మామ! విశాఖపట్నంనుంచి అప్పుడే రైలుదిగి వచ్చినట్లున్నాడు. మాఅత్త క్రోధావేశంతో నన్నెడంగా తోస్తూ చెంప మీదకొట్టడం ఒక్కటే ఆయన కంటబడినట్లుంది. తన మనసులో ఏమనుకున్నాడో ఏమోకాని ధుమధుమలాడుతూ మొగం కందగడ్డవలెచేసి కాల్చేచూపులతో నన్ను చూస్తూ 'ఇంకొకటి తగలనీ రెండో దవడమీద!' అన్నాడు బొంగురుగొంతుకతో.

మాట్లాడకుండా గదివిడిచి వెళ్ళిపోయింది మా అత్త.

పడగెత్తి బుసకొట్టేపాములాగ క్రోధావేశంతో ఊగుతూ నిల్చున్నాడు మా మామ, నన్నేగాదిగా చూస్తూ. అట్టేసేపు అతనియెదుట ఆవిధంగా నిల్చుంటే బ్రాహ్మణ్యానికి వెర్రెత్తి చేతికర్రతో నాతల పగులగొడతాడేమోనని భయం వేసింది నాకు. నేనేదో పెద్ద తెలివితక్కువపనికి సాహసించినట్లు, తనభార్య లెంపకాయకొట్టి తగినట్లు నాకు బుద్ధిచెప్పినట్లు, అర్థంచేసుకున్నాడు కాబోలు ఆయన! కాని ఏవిధమైన సమాధానం చెప్పడానికీ నోరు పెగలలేదు నాకు.

నాబట్టలు, పుస్తకాలు, పరీక్ష, పెళ్లి, అన్నీవిడిచిపెట్టి నోరు మెదపకుండా ఎలాగో ఆగదిదాటి యివతల పడినాను. ఆయింట్లోనే కాదు—ఆ ఊళ్ళో యింకో క్షణం నిలవడానికి బుద్ధిపుట్టలేదు. తిన్నగా రెయిలుస్టేషనువైపు నడిచాను.

* * * *

కథ వింటున్నంతసేపూ యావన్మందిమీ కిక్కురు మనకుండా నిర్ఘాంతపడికూచున్నాం. శరత్కాలపు వెన్నెల దివ్యంగా ఉంది ఆవేళ. నెమ్మదిగా ప్రవహిస్తూ ఉన్న గౌతమీనదిలో చిత్రంగా ప్రతిఫలిస్తూ బలేరమ్యంగా చల్లగా కనిపించాడు చంద్రుడు. శీతగాలి ప్రారంభమై కొంచెం చలివేసింది. సుమారు రేడున్నర గంటలరాత్రి కావచ్చింది. దూరంగా ఎక్కడో నక్కలు అరుస్తున్న

ధ్వని వినవచ్చింది.

'చాలా వేళ అయినట్లుంది. ఆకలిచేత నాకడుపు దహించుకుపోతూ వుంది. లాంచివద్దకు పోదాంపదండి యిక.' అన్నాను నేను.

విశ్వనాథం చెప్పిన యీ విపరీతమైనకథలో ఒక్క అక్షరమైనా నిజంలేదని అందరికీ తెలుసు. కాని యిట్టికథ కల్పించి చెప్పడంలో వాడివుద్దేశం ఏమిటి చెప్మా. అని ఎవడిమట్టుకు వాడు ఆలోచించుకోవలవచ్చింది. తమతమ ప్రేమానుభవాలను ఘనంగా చెప్పకున్న ప్రకాశం, సుందరేశంవంటి అహంభావస్వాముల నెదిరించి వెక్కిరించి సిగ్గుపరచడానికి కాబోలని తోచింది నాకు.

మర్నాడు పాపీకొండలలో ఒంటరిగా వున్న సమయంచూసి విశ్వనాథాన్ని కదిపిచూశాను వాడి కథను గురించి

'అవునోయి మరి! గోలుకొండ మిరియాలు గచ్చకాయలంతలని నచ్చజెప్పే పెద్దమనుష్యులకు లంజావ్వారు ఆవాలు తాటి కాయలంతలని చెప్పాలా, వద్దా?' అన్నాడు చిరునవ్వుతో.

---

# సినిక్ మగడు

అతడు మంచి చదువుకున్నవాడు. కవి. యువకుడు. కాని సినిక్ ! మంచిలో చెడ్డ, చెడ్డలో మంచి, ఉంటుందన్న సంగతి యెరుగునుకాని, దేనియందైనా ముందుగా చెడ్డనే వెదకడానికి సిద్ధపడేవాడు. మేలెంచక కీడెంచడమే అతని నైజం ! కాబట్టి తరుచుగా అతనికీ, భార్యకూ చిత్రమైన వాగ్వాదాలు వస్తూవుండేవి.

తనలో వుండే మంచిని సహితం ప్రకటించుకుందుకు యిష్టపడేవాడు కాడతడు ! కాని నిజంగా చాలా యోగ్యుడు.

మొగుడితత్వం బాగా తెలుసును గనుక, అతని మాట లెంత విపరీతంగా వినవచ్చినా ఆమె ఎన్నడూ కోపగించుకునేది కాదు. నవ్వుతూ భర్తను అప్పుడప్పుడు మందలించేది, సరసంగా. ఆమె ముఖంఎప్పుడూ నవ్వుతున్నట్లే ఉండేది. మనిషికూడా సొగసరి. కించత్ పెంకెది. తెలివైన పిల్ల. మొత్తానికి ఆమెకు జీవిత మొక మధురమైన స్వప్నంవలె ఆనందమయంగా తోచేది ఎల్లప్పుడూ.

దంపతులకు ఒకరియెడల ఒకరికి ఎంతో ప్రేమ. వాళ్ళ ప్రథమసంతానం ఒక కొడుకు. ఇద్దరికీ ఆ పిల్లడంటే

ప్రాణం ! అబ్బాయిని ఒడిలో తీసుకొని, రొమ్మున కదు ముకుంటూ వాడిమీద వెర్రిప్రేమ కురిపించేది తల్లి ; సముద్రం కెరటాలవలె హృదయంలో అతనికి ఎంతప్రేమ పొంగుకొచ్చినా, ఆమెవలె వెర్రులోడేవాడు కాడు తండ్రి!

ఒకనాటి ముచ్చట యిది. తీరుబడిగా వాలుకుర్చీలో కాళ్ళుచాచి కూచుని, ఏదో యింగ్లీషుపుస్తకం చదువుకుంటున్నాడాయన. పిల్లవాడి నెత్తుకొని ఎగర వేస్తూ, వాడిబొజ్జ నడిమి ముద్దాడి కితకితలు పెడుతూ, కిలకిల నవ్వుకుంటూ, ఆడుతూ వచ్చిందామె.

భార్య:—(ఉత్సాహంతో బిడ్డను యెత్తి చూపుతూ) చూశారా, మన అబ్బాయికి చిన్న ఎలకపళ్లు వస్తున్నాయి !

భర్త:—(చదువుతున్న పుస్తకం నుండి తలైనాయెత్తక) అట్లాగా ?

భార్య:—మీకు ఒక్క పిసరైనా ఆశ్చర్యంకాని, సంతోషంకాని కలిగినట్లులేదు !

భర్త:—(తలయెత్తి, చిరునవ్వుతో మాతాశిశువులను అట్టే చూస్తూ) ఓసి వెర్రిదానా! పిల్లడు పళ్లు చేస్తే అందులో ఆశ్చర్యపడవలసినది ఏమున్నది గనక ? పిల్లలందరికీ వస్తాయి పళ్లు. అట్లాగే మన అబ్బాయికి కూడా వచ్చాయి. లోకంలోని అందరు పిల్లలవలె గాక, ఎన్నాళ్ళకూ మనవాడికే నోట్లో పళ్ళు మొలవకనేపోతే, అప్పుడు నిజంగా ఆశ్చర్యపడవలసినదే !

భార్య:—చాలులెండి మీ అడ్డువాదన. ఎప్పుడూ ఇంతే! ...మీరేమో ముచ్చటపడతారనుకొని,—

భర్త:—పిల్లవాడికి పళ్ళువస్తే ముచ్చటపడమన్నావా నన్ను? సౌఖ్యప్రదమైన విషయాలకు ముచ్చటపడడం సబబు. ఆఫీసువేళ దాటకుండా రోజూ నువ్వింత వండిపెట్టగలిగితే నేను ముచ్చటపడాలి! జరుపులు పెట్టకుండా, గునియకుండా నువ్వు కోరినప్పుడల్లా నీకు నేను చీరలు, నగలు కొని ఇస్తూ వుంటే, నువ్వు ముచ్చటపడాలి! అంతేకాని,—

భార్య:—మీతో వాదించి యేం లాభం?

భర్త:—(నవ్వుతూ) నిజానికి మన అబ్బాయి పళ్ళు చేసినందుకుగాను, మనం ఉభయులమూ ఎంతో సానుభూతి చూపవలసి వుంటుంది!

భార్య:—సానుభూతెందుకు పైపెచ్చు?

భర్త:—ఎందుకా? కుర్రవాడికి పళ్ళువస్తున్నాయంటే, మున్ముందు జరగబోయే దుఃఖమయగాథకు తొలి ప్రకరణం ప్రారంభమైనదన్నమాట. ఇప్పుడు బియ్యపుగింజలవలె ఒకటో రెండో చిన్నని పాలపళ్ళు మొలచి ఉంటాయి. క్రమంగా పైని, క్రిందను, చిన్నవి, పెద్దవి, కోరలు, దంతాలు, అన్నిరకాల పళ్ళూ మొలుచుకొస్తాయి.

భార్య:—అయితే?

భర్త:—ఒక్కొక్క పన్ను మొల్చినప్పుడల్లా పాపం అబ్బాయి కొంతబాధను ఓర్చుకోవలసి ఉంటుంది

కదా? ఇక లోపలిదంతాలు మొలచినప్పుడు చంటి
పిల్లలకు సర్వసాధారణంగా జబ్బుచేసి తీరుతుంది.
జ్వరం, విరేచనాలు, కడుపునొప్పి, చెవిపోటు మొద
లైన పాడువ్యాధులన్నీ అంకురిస్తాయి. అప్పుడు
నూతాశిశువులకే గాక, యింట్లో ఎవరికీ కంటి
నిండా నిద్రఅనేది ఉండదు! క్రొత్తగా పళ్లుచేసిన
పిల్లలకు అప్పుడప్పుడవి సలుపెక్కి కాబోలు,
ఏదైనా కొరకాలని వుంటుంది. తల్లిపాలు త్రాగు
తున్నప్పుడు చనుమొనలు కొరకడం ప్రారంభిస్తారు
మొదట. ఒక్కొక్కప్పుడు అట్లా కొరకబడిన
స్తనాలు వాచిపోయి, పుండుచేసి. సలుపు పోటు
పెట్టి, తల్లిని మంచం ఎక్కిస్తాయి. పాలు
త్రాగుతూ శ్రీకృష్ణుడు చన్నుకొరికేస్తే, పాపం
పూతన రాసుగువంటి మనిషి అయికూడా
గుక్కెడునీళ్లు అడుగకుండా చచ్చిపోయిందట!
పిల్లల పళ్ళతీపు తల్లిపాలు కొరకడంతో తీరక,
క్రమంగా ఒంటిమీద చొక్కాలు, ఆఖరునే
రబ్బరుబొమ్మలు, చేతివేళ్ళు మొదలైన వాటి
మీద పడుతుంది. ఈ విధంగా చిన్నప్పుడు అన్నీ
కొరకటంతోగా అలవాటైన కొందరికి పెద్దయిన
పిమ్మటకూడా ఆ వ్యసనం పూర్తిగా వదలదు.
గోళ్ళు, కలాలు, మీసాలు కొరుక్కుంటూ ఉం
టారు కొందరు పెద్దమనుషులు! దంపతులు ప్రే
మోద్రేకంతో ఒండొరుల బుగ్గలు, పెదవులు

గంట్లుపడి, రక్తాలొచ్చేటట్లు కొరుక్కుంటారని చెప్తారు మనకవులు. కరటకశాస్త్రి చెప్పినట్లు 'శ్రీకృష్ణమూర్తివారు రాధికతో శలవిస్తున్నారు: ఓరాధికా, నీకోపం తీర్చుకోవాలన్నట్లాయితే,

'ఘటయ భుజ బంధనం
రచయ రద ఖండనం,
యేనవాభవతి సుఖజాలం.'

అనగా యేమంటున్నాడంటే కవీశ్వరుడు, చేతులొత్తి ఉక్కిరి బిక్కిరి అయ్యేటట్టుగా కౌగలించుకో; మరిన్ని పెదవులు రక్తాలొచ్చేటట్టు కొరికెయ్యి, అంటున్నాడు.'

భార్య:—(నవ్వుతూ) కొరికిందా రాధ?

భర్త:—రాధ నీఅంత పెంకెదికాదు.

భార్య:—అలాగా? ఒట్టి సత్తెకాలపుపిల్ల కాబోలు!

భర్త:—(నవ్వి)......కొందఱు చిన్నపిల్లలకు యీ కొరకడం అలవాటు మహోదారుణంగా పరిణమిస్తుంది చివరకి. మేకులు, సీసాలు, పైసాలు, తాళంచెవులు, పిన్నులు, చాకులు, చెమ్చాలు అన్నీ కొరుకుతా మంటారు. ఒక్కొక్కప్పుడు ప్రాణాపాయం కలిగే ప్రమాదాలుకూడా సంభవించడం కద్దు. మృతకళేబరాలు కోసేటప్పుడు కొందరి కడుపులలో గాజుపెంకులు, చిల్లరడబ్బులు, మేకులు ప్రత్యక్షమవుతూ ఉంటాయని చెప్తారు డాక్టర్లు. పిల్లలు పిల్లలతో ఆడుకునేటప్పుడు

వాళ్ళలో వాళ్ళు తగవులాడుకొని, ఒకరినొకరు పళ్ళు నాటేటట్లు కరుచుకుంటూరు. మనిషికాటుకి మందు లేదని సామితె చెప్తారు మనవాళ్ళు!

బాల్యావస్థలో కొరకడం అలవాటైన పిల్లలకు కొంచెం జ్ఞానంవచ్చిన పిమ్మట ఆపళ్ళతీపు చిరితిండి మీదికి పోతుంది. పచ్చి జామికాయలు, పండిన బాదంకాయలు, తాటిపళ్ళు, కొబ్బరికాయలు, చెరుకు ముక్కలు, వేరుసెనగలు, బఠాణీలు, వేచిన కందిపప్పు, జంతికలు, చక్కిలాలు, చేగోడీలు, వడియాలు, మొదలైన గట్టి పదార్థాలు తినడానికి ఇష్టంగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు అట్టి తిళ్ళు ప్రమాదకరంగా పరిణమిస్తాయి. ఒకప్పుడు పళ్ళు విరిగిపోవచ్చును. నాలుక కత్తిరింపబడవచ్చును. గొంతుకలో ఏదైనా ఇరుకుకొని ప్రాణహాని సంభవించ వచ్చును. ఇట్టి విపరీతాలేవీ తటస్థించక పోయినా, అట్టి చిరితిండి దేహారోగ్యాన్ని మట్టుకు తప్పకుండా పాడు చేస్తుంది. అజీర్తి, కడుపునొప్పి, వాంతులు, కలరా మొదలైన రోగాలు రావడానికి యిట్టి తిళ్ళే మూల కారణాలు!

ఇన్ని యిబ్బందులకూ హేతుభూతాలైన పళ్లు మొలచినవి మొలచినట్లుగానే అందంగా, చిన్నవిగా, తెల్లగా, శుభ్రంగా ఉంటాయేమో, అంటే, అదీ లేదు. బాల్యావస్థలోనే అన్నీ ఊడిపోయో, విరిగిపోయో, మళ్ళీ నొప్పి చేస్తాయి. అంతటితోనైనా శని విరగడైతే బాగుండును. కాని వాటిస్థానే క్రొత్తపళ్లు మొలుచుకొస్తాయి.

# కృష్ణమూర్తి కథలు

ఇవి కొంచెం పెద్దవిగాను, వంకరటింకరగాను, ఎడఎడం
గాను, పొట్టివిగాను, వికృతంగాను మొలవడం తరుచు.
కొందరికి కొంతరపళ్లు, పారపళ్లు మొలుస్తాయి. ముఖం
అంతా అందహీనమవుతుంది. పెదవులు మూతపడవు.
ఇంకా కొందరు దురదృష్టవంతులకు మీదిపళ్లు సూటిగా
ముక్కుల్లోనుండి తోసుకొని వస్తాయి, పై పెదవెను చీల్చి
వేసి. అప్పుడు ముఖానికి నిజంగా రాక్షసిరూపు వస్తుంది.

భార్య:—ఎట్టిరూపు దేనికివస్తుందో మానుతుందోకాని,
ఇప్పుడు మీవర్ణనకు వస్తూవుంది రాక్షసిరూపు!
ఇక చాలించండి మీ పుణ్యముంటుంది:

భర్త:—కోపాకూ వినుమరి. పళ్ళమూలాన ఎన్నెన్ని
అనర్థాలు ఉన్నాయో నీచేతనె ఒప్పిస్తానుగా?

పళ్లు అందంగా ఉన్నా, అష్టవక్రంగా ఉన్నా,
వాటికి చెయ్యవలసిన చాకరీలో ఏమీ లోటు ఉండ
కూడదు కదా? ఇంట్లో శవంపోయినాసరే, పళ్లు తోము
కోవడం మాత్రం తప్పదు! అరవవాళ్ళయినా నాలిక గీసు
కోవడం మానివేయగలరు కాని, కేవలం పళ్ళుతోముకో
వడమే మానివేయలేరు. మన నవీననాగరికులైనా సంధ్యా
వందనం, దైవప్రార్థన మొదలైనవంటే విసర్జించగలరు
కాని, యింకా దంతధావనకర్మను విడిచిపెట్టడానికి సాహ
సించలేకుండా ఉన్నారు! పుడకో, కుంచో, పౌడరో,
పేస్టో, ఏదో ఉపయోగించి, ప్రతీమనిషీ పళ్లుతోముకొని
తీరవలసినదే! లేకుంటే ఆప్తబంధువులు సహితం దూరంగా

జరుగుతారు. అసహ్యించుకుంటారు. తిడతారు. అందుకనే, శుభకార్యాలలోను, సభలలోను, పదిమందీ చేరి ఒకచోట కూర్చోవలసి వచ్చినప్పుడు మనవాళ్ళేక మంచి లాంఛనాన్ని పాటిస్తూ ఉంటారు. అత్తరు, పన్నీరువంటి సుగంధ ద్రవ్యాలు సభాసదుల మీదజల్లి చందనతాంబూలాలు అర్పిస్తారు. ఉద్దేశమేమిటీ అంటే, ఒకరి నోటికంపు, చెమటకంపు, దగ్గరనున్న రెండోవాళ్ళను బాధించకుండా ఉండగలందులకు! ఈ విషయంలో నరుడికంటె పిట్టలు, జంతువులు నయం. పక్షులకు పళ్ళే ఉండవు! జంతువులు పళ్ళుతోముకోక పోయినా, నోరు శుభ్రంగానే ఉంచుకోగలవు. నోరే అన్నమాటేమిటి? శరీరం యావత్తూ మనకంటె శుభ్రంగా, ఆరోగ్యంగా ఉంచుకోగలవు. సృష్టిలోని జీవరాసులన్నిటిలోను అందగాడిననీ, తెలివైనవాడిననీ గర్వించే మానవుడుమాత్రం అన్నివిధాలా కల్మషమ్మారితుడు; దుర్గంధమయుడు!

పళ్ళయెడల ఎంతో శ్రద్ధతీసుకొని ఎన్నివిధాల అవస్థపడినా, మానవుడు అప్పుడప్పుడు దంతరోగాలకు గురి అవుతూనే ఉంటాడు. 'పయోరియా' జబ్బు అనుభవించే వాడికేగాక, యెదటివాళ్ళకు కూడా ప్రాణసంకటంగా ఉంటుంది! ఇక పుప్పిపళ్ల బాధ ఆ పడేవాడికీ, దేవుడికే తెలియాలి. ఆబాధకు ఎంతటివాడికీ అప్రయత్నంగా నోటవెంట బూతులు వస్తాయి. దేవుడిమీద నమ్మకం పోతుంది. ప్రేమించేవారి యెడల విరక్తి పుడుతుంది. డాక్టరుచేత పళ్లు ఊడదీయించుకునేదాకా నిద్రా

హారాలు ఉండవు.

ఇక చిగుళ్లు వాచిపోవడం, పళ్లంట రక్తం కారడం, పళ్ళు కదుల్తూ ఏదీ నమలనియ్యక పోవడం, యిత్యాది జబ్బు లెన్నో వస్తూఉంటాయి, గ్రహచారం చాలని వాళ్లకు. దంతవైద్యులు యిల్లు గుల్లచేస్తారు. పళ్ళు తెల్లగాతోమి శుభ్రపరచడానికే పదిరూపాయి లడుగుతాడు డెంటిస్టు! లేని వ్యాధులు ఉన్నవని చెప్పి బెదిరించి, డబ్బులాగడానికి ప్రయత్నిస్తాడు కూడా! ఉన్న పళ్ళు ఆరోగ్యంగా లేవని ఊడదీయించుకో మంటాడు. బోసినోటి ముసలివాళ్లను పళ్ళుకట్టించుకోమని బలవంతం చేస్తాడు. ఒక్కొక్క పన్ను పీకివేయడానికి రెండు మొదలు ఐదు రూపాయిల వరకూ ఛార్జీ అడుగుతాడు. అట్టే బిగపట్టి బేరంచేస్తే, ఆకోపం పళ్ళు ఊడదీసేటప్పుడు తీర్చుకుంటాడు. క్రొత్తపళ్ళు అమర్చడానికి 'సెట్'కి వందరూపాయి లడుగుతాడు! ఇంతా కట్టించుకుంటే, ఒక్కొక్కప్పుడు నోటికొలతలు తిన్నగా కుదరక, అపళ్లతో నానాబాధలూ పడవలసి వస్తుంది. నోరునొప్పి చెయ్యడం, దవడలు సొట్ట పోవడం, మూతి వాచిపోవడం, మొదలైన అనర్థాలెన్నో సంభవిస్తాయి. దేవుడిచ్చిన పళ్లతో అంటే, ఎప్పుడో గ్రహచారం చాలనప్పుడు తప్ప, నొప్పితో బాధపడ వలసిన అగత్యం లేదు. కాని కట్టించుకున్న పళ్లతో అను నిత్యమూ అవస్థపడక తీరదు! ఉదయమే వాటినితోమి, 'లోషన్'లో కడిగి, జాగ్రత్తగా దవడలకు అమర్చుకో వాలి. రాత్రి నిద్రపోయేటప్పుడు తీసివేసి, కడిగీ, జాగ్రత్త

పెట్టుకోవాలి. అశ్రద్ధగా ఏ టేబిలుమీదనో, గూట్లోనో దాచితే ఎలకలో, పిల్లులో ఎత్తుకొపోతాయి!

పళ్లనుగూర్చి నరుడు తన జీవితపరిణామమందు యిన్ని అవస్థలు పడవలసి ఉండగా, అబ్బాయి పళ్ళు చేస్తున్నాడని సంబరపడమంటావుకదా, ఏమనుకోవాలి నేను ?

భార్య:—శుభం కోరవోయి పెళ్లికొడకా అంటే వెనకటికి కోబుద్ధిమంతుడు ఏదో అన్నాడట లెండి! అట్లా ఉంది మీ వరస! ఎప్పుడూ అపశకునం మాటలు, ఓగాయిత్యంకబుర్లు—

భర్త:—నిజం అట్లానే ఉంటుంది మరి, వెగటుగా!

భార్య:—అయితే ఆవెగటుగా, అసహ్యంగా ఉండే నిజాన్ని పలికి నలుగురినీ నొవ్వజేసి, వాళ్ల చేత నిష్ఠూరాలు పడేకన్న, తియ్యతియ్యని అబద్ధాలే చెప్పి, అందర్నీ సంతోషపరచి మెప్పుపొంద రాదూ ?

భర్త:—అది మీ ఆడవాళ్లకే చెల్లింది!

భార్య:—(ముసిముసినవ్వుతో తల తమాషాగా వంకిస్తూ) కవులకుమాత్రం చెల్లదూ ?

---

# సత్యాన్వేషణ

'...ఐతే తిరుపతి బిచ్చగాళ్లను కూడా నమ్మవలసి నదే అన్నమాట! వాళ్ల దూది ముక్కలు, మొండిచే తులు, మూగిచేష్టలు,—అన్నీ నిజమే అని ఎందుకనుకో కూడదు?' అని అడ్డువాదనకి దిగింది లక్ష్మి.

'నీ ఉపమానం క్రూరంగా ఉంది. బిచ్చగాళ్ల కృత్రి మ వేషాలకూ, పత్రికావిలేఖరుల అతిశయోక్తి వ్రాతలకూ సామ్యంలేదు.' అన్నాను తల ఊపుతూ.

'రెండూ మోసమేగా? ముష్టివాడి దొంగ వేషాలు చప్పున బయలుపడతాయి. న్యూస్ పేపరువాడి అబద్ధాలు ఒకంతట ఋజువుకిరావు! అంతే తేడా. పొట్టపోసుకుందుకు వీళ్ళు ఎన్నెన్ని కాని కూళ్లయినా తింటామంటారు. ప్రపం చంలో సహజంగా అనునిత్యమూ జరిగే విడ్డూరాలతోను, వింతలతోను, ఘోరాలతోను తృప్తిలేదు మన వార్తా ప్రచారకులకు. విశ్వామిత్ర సృష్టిచేసి, అబద్ధాలు, అసం దర్భాలు కల్పించిప్రచురించాలని చూస్తారు, లోకాన్ని భ్రమింపజేయడానికి!... ఇట్టి విపరీతం రాతలు ఎట్లా నమ్మాలో బోధపడకుండా ఉంది నాకు.' అంటూ ఆవార్తా పత్రిక నాముందుకు విసరింది.

తీసి చదివాను. అందులో 'అద్భుతవార్తల'నే

# సత్యాన్వేషణ

శీర్షిక క్రింద ఎన్నెన్నో చిత్రాలు ఉన్నాయి. రెక్కలుగల మహాసర్పమొకటి ఎగురుతూ ఉండగా ఎవరో చూసినారనీ, 'ఈజిప్టు'లో నైల్ నది నీళ్లన్నీ ఒకనాడు రక్తంగా మారిపోయినాయనీ, ఒకానొక అరవ బాలికకు ఐదవయేట కవలబిడ్డలు కలిగి మాతాశిశువులు క్షేమముగా నున్నారనీ, హిమాలయప్రాంతమున నొక వైరాగి అన్నపానములు ముట్టక పదేండ్లనుండి గాలిపీల్చి బ్రతుకుచున్నాడనీ, అమెరికాలో ఒక మిస్సమ్మకు కలలో కనుపించినదనీ, మిరపమొక్కకు ఒక 'జర్మన్ సయంటిస్టు' గుమ్మడిపండ్లు పండించినాడనీ, ఆస్ట్రేలియాలో ఒక కుక్కకడుపున తెల్లని ఏనుగుపిల్ల జనించినదనీ, మలబారులో ఒక బిడ్డలతండ్రి హఠాత్తుగా తన మగతనమును గోల్పోయి స్త్రీగా మారి యిప్పుడు గర్భము దాల్చియున్నాడనీ,— ఇట్లాటి ఆశ్చర్యకరమైన వార్తలు ఎన్నో ఉన్నాయి ఆపత్రికలో. చదువుతూ నాలో నేను నవ్వుకున్నాను.

టేబిల్ వద్ద నాకెదురుగా కూర్చుని, ఓరగా నావేపు చూస్తూ, కొంటెనవ్వుతో, 'ఏం?.. బాగున్నాయా వార్తలు? ఇవి వ్రాసిన ప్రముఖుడు సాక్షాత్తూ సత్యహరిశ్చంద్రుడనేనా మీవాదన?...అబద్ధాలని తెలిసికూడా, మీరు వాటిని 'అతిశయోక్తు'లంటూ సమర్థించాలని చూస్తారు—నాకు తెలుసు.' అన్నాది లక్ష్మి.

'అదికాదు లక్ష్మీ! బాగా యోచించకుండా మనం ఏసంగతినైనా 'నాన్‌సెన్స్' అనీ కొట్టిపారవేయకూడదు. మన ఊహాశక్తికి, అనుభవానికి, అందని విషయాలు ఎన్ని

లేవు యీ విశాలప్రపంచంలో? ఐతే, ఇతగాడెవడో యీ పత్రికలో వ్రాసిన వృత్తాంతాలన్నీ నిజమైయుండి తీరాలని కాదు నేజెప్పేది. కాని, నిజాన్నిపోలిన అబద్ధాలు వున్నట్లుగానే అబద్ధాలేమో అనిపించే నిజాలుకూడా వుంటాయని నామనవి.' అన్నాను ఏవేవో దృష్టాంతాలు జ్ఞాపకం తెచ్చుకుంటూ.

'వెనుకటివలెగాక యిప్పుడు మీధోరణి అంతా అగోచిత్రంగా వుంటూవుంది. మూఢనమ్మకాలు, పిచ్చి సిద్ధాంతాలు, మెట్టవేదాంతాలు నేర్చుకుంటున్నట్లున్నారు పెద్దవాళ్లవుతున్నకొద్దీ!...అసాధ్యాలు సాధ్యాలవుతాయనీ, అసందర్భాలు సత్యములౌతాయనీ క్రొత్తగా కనిపెడుతున్నట్లుంది మీబోటి విద్యావంతులంతా! 'కాకులెక్కడైనా తెల్లటివి వుంటాయా?' అంటే, 'ఎందుకు వుండకూడదూ?' అని అడిగే తంతుకి దిగింది మీవరస' అన్నాది వెర్రివాడివైపు చూస్తున్నట్లు నావేపు జాలిగా చూస్తూ.

'అవును, తెల్లకాకుమాత్రం ఎందుకుండకూడదూ? భగవంతుడి సృష్టికి అవి నిషేధమా?' అన్నాను నవ్వుతూ.

'చాలులెండి యీమొండితర్కం.' అన్నాది కసిరే గొంతుకతో.

క్షణం ఊరుకొని; పరధ్యానంగా చేతివేళ్లు జుట్టులో గ్రుచ్చి క్రాపింగు ఎగదువ్వుకుంటూ— నేను, 'ఏమో, శాస్త్రజ్ఞుల పరిశోధనవల్ల క్రొత్తగా మనకిప్పుడు అనేక చిత్రమైన సంగతులు తెలియవస్తూ ఉండడం లేదూ?

# సత్యాన్వేషణ

ఒకప్పుడు తాము వెక్కిరించిన మన మంత్రశాస్త్రాలు, జ్యోతిషం, దెయ్యాలు, దేవతలు, శకునాలు మొదలైన వాటినే పెద్ద పెద్ద సయంటిస్టులు నమ్ముతూవున్నప్పుడు, యీ యిరవయ్యోశతాబ్దంలో దేనికీ ఆశ్చర్యపడవలసిన అగత్యంలేదు. అబద్ధాలనుకున్నవి నిజాలవుతున్నాయి ; నిజాలనుకున్నవి అబద్ధాలవుతున్నాయి. మానవ బుద్ధికి సాధ్యంకాని దేదీ ఉన్నట్లు తోచకుండా ఉంది. దేనినీ అసందర్భమనీ, 'నాన్సెన్స్' అనీ కొట్టిపార వేయడానికి వీలులేకుండావుంది. ఎడిసన్ అనే గొప్ప సయింటిస్టు చచ్చిన వాళ్ళతో మనం మాట్లాడవచ్చునని చెప్తున్నాడు! నక్షత్ర శాస్త్రజ్ఞులు అంగారకగ్రహంలో మనవంటి మనుష్యులున్నారని తలచి, వాళ్ళతో ప్రశ్నోత్తరాలు నడపడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు! అమెరికాలో పరిశోధకులు కొందరు పురుషసంపర్కం లేకుండా స్త్రీలు బిడ్డల్ని కనవచ్చునని రుజువు చేస్తున్నారు! ఇవన్నీ విడ్డూరాలు, విపరీతాలున్నూ; కాని అక్షరాలా నిజాలు'' అని చెప్పాను. నా వాదం బలపరచుకుంటూ

'చిత్రం! ఈ కలియుగంలో అన్నీ యిట్టి విపరీతాలే పుట్టుకొస్తాయని మనవాళ్లు చెప్పనే చెప్పారట గ్రంథాలలో'......మొన్న మొన్నటిదాకా మీ అభిప్రాయాలు ఎంతో భిన్నంగావుండేవే! ఇంతలోనే యిట్టి చోద్యమైన మార్పా?......బహుశః ఆ మళయాళం వాడెవడో ఆడదైపోయినట్లు, యింక కొన్నాళ్ళకు మీరేమైనా మరొక వ్యక్తిగా మారిపోతారేమో!' అన్నాది

లక్ష్మీ, నవ్వు ఆపుకోలేకుండా.

నాకుకూడా నవ్వువచ్చి, 'ఏమో, ఎవరు చెప్ప గలరు?' అన్నాను వేళాకోళానికి.

ఆ మాటమీద వెంకటలక్ష్మీ నన్ను ఎగతాళిచెయ్య డానికి ప్రారంభించింది, చిన్నపిల్లలు తమతో జట్టుకూడని అశక్తులని చప్పట్లుచరిచి, ఉడుకుబోతు మాటలని విసి గించినట్లుగా.

'మన కథలలో నాయకులు అట్లా మారి పోతూ ఉండేవారట లెండి. విష్ణుమూర్తి దశావతారాలు యెత్తినట్లు, శత్రువులను జయించడానికి వీళ్లు అనేక రూపాలు దాల్చేవారట. సాధారణంగా కథానాయకుడు పక్షిరూపంతో చెట్లు, కొండలు దాటి, జలచరరూపంతో సప్త సముద్రాలు యీది, భరిణలో యీగరూపంలో ప్రాణాలుదాచుకున్న రాక్షసుణ్ణి సంహరించి, రోమగానో నల్లిగానో నరుడికంట పడకుండా పోతుటీగైనా దూరలేని రాజాంతఃపురం జొరపడి, కలలో చూచిన ప్రియురాలిని కలుసుకోగలిగేవాడు! అట్లానే—'

'నువ్వు వేళాకోళంచేసి మాట్లాడితే నేను చెప్ప లేను కాని, యిన్నాళ్లూ మానవశక్తికి అసాధ్యాలనుకున్న అద్భుతకార్యాలెన్నో యిప్పుడు చేయగలుగుతున్నారు సయంటిస్టులు. ఇంతెందుకూ, 'టెస్టుట్యూబ్' పిల్లల్ని నిర్మిస్తున్నారంటే, ఎంత ఆశ్చర్యకరమయిన విషయమో ఆలోచించు. ఈమధ్య అమెరికాలో ఎవతో ఆవిధంగా కవలబిడ్డల్ని కన్నదట, మొగవాడిని తాకకుండా!'

అన్నాను.

తల తమాషాగా పంకిస్తూ, 'ఆశ్చర్యమేముంది ! మన పురాణాలలో అనేకదృష్టాంతాలున్నాయి, అట్టివి. కుంతీకొడుకులంతా మరి గాలికిపుట్టినవాళ్లేగా ? మనం మన అజ్ఞానంకొద్దీ ఆ యిల్లాలునుగూర్చి పాపంమాటలను కుంటాం కాని, నిజంగా ఆమె టెస్టుట్యూబ్ పిల్లల్నే కన్నది ! పూర్వం మన ముసలిరాజులంతా సంతానాలెట్లు పొందేవారని? తపస్సుచేయడానికని యే అడవులకో పోయేవారు కొన్నాళ్ళపాటు. అప్పుడు మన దేవుళ్లు వాళ్ళకు ప్రత్యక్షమై, పండో కాయో చేతిలోపెట్టి, బిడ్డల్ని వరమిచ్చేవారు. తపస్సు చాలించి భర్తలు యింటికి రాగానే యథావిధిగా రాణీలు గర్భవతు లయ్యేవారు ! అవునా?' అన్నాది లక్ష్మి.

నేనేమీ మాట్లాడలేను.

తిరిగీ ఆమె, 'మొగుడుచచ్చిన సావిత్రికి వందమంది కొడుకులు కలిగేటందుకు వరమిచ్చిన యముడి ఉద్దేశం ఏమిటని మీ ఊహ ! ఆమెకు టెస్టుట్యూబ్ పిల్లల్ని చేద్దామనే అతనిసంకల్పం'...... టెస్టుట్యూబ్ పిల్లల్ని పుట్టించే మహావిద్య మీకొమ్ములు తిరిగిన సయంటిస్టులకే తెలుసునని అనుకోకండి. మన బైరాగులు, స్వాముల వార్లు, కోవెల పూజార్లు, భూతవైద్యులు మొదలైన వాళ్ళంతా కొంతవరకు యీ విద్యలో ప్రవీణులే ! మంత్రించి యింత విభూతో, కుంకమో, తులసిదళమో, తీర్థమో యిచ్చి, సంతానాపేక్షగల అమాయకులను

తరింపజేస్తారు, యీ మహానుభావులు.' అన్నాది ఉద్రేక స్వరంతో.

'అయితే నీ అభిప్రాయంలో టెస్టుట్యూబ్ పిల్లల గూర్చి సయంటిస్టులు ప్రకటించినదంతా అబద్ధమూ, దొంగవేషమూ, అనా!' అన్నాను కోపంతో మొగం చిట్లిస్తూ.

'కాకపోవచ్చును. కాని, ఎందుకొచ్చిన పరిశోధన యిది? మాటవరసకి, పురుషసహాయంలేనిదే స్త్రీలు బిడ్డల్ని కనడానికి సాధ్యమవుతుందనే అనుకుందాం. ఏం లాభం? సంతాననిరోధసాధన కబుర్లతో ప్రపంచమంతా మారుమ్రోగుతో ఉన్న యీ యిరవయ్యోశతాబ్దంలో యీ టెస్టుట్యూబ్ పిల్లలు ఎవరికి అవసరమని? అట్టి సంతానం పొందడంలో ఆడదానికి ఏమిటానందం? ఇక మానవసంఘంలో దాంపత్యం, ప్రేమ, తండ్రితనం అనే మాటలకు అర్థమేముంటుంది? బిడ్డలంటే 'ఫోర్డుకార్లు', 'రాస్కోప్ వాచీలు' కావుకద, ఫాక్టరీలలో తయారుకావడానికి? ప్రకృతివిరుద్ధంగా టెస్టుట్యూబ్ బిడ్డల్నికనేటందుకు ముచ్చటపడడానికి స్త్రీలంటే మానాభిమానాలు, హృదయమూ లేని యంత్రాలనుకున్నారా? శరీరంలోని ప్రతిరక్తకణము, ప్రతినరము మగవాడికోసం గోలచేసి, హృదయము, ఆత్మ ఆతనితో ఐక్యమై, ప్రేమఫలితంగా సంతానంపొందితేనే తప్ప, ఆడదానికి తృప్తి ఉండదు'... ఊసుపోని మంగలి పిల్లిబుర్ర గొరిగాడని సామెత చెప్పినట్లు, మీ సయంటిస్టులకు వేరేవ్యాపకాలేవీ లేక, యిట్టి

మతిభ్రమ పరిశోధనలన్నీ చేస్తూఉంటారు! ఇక గోరంతలు కొండంతలుచేసి, లోకానికి ప్రకటించడానికి ఉండనే ఉన్నారు యీ న్యూస్ పేపరువాళ్ళు.'

అని కొంతసేపు ఊరుకొని, నిట్టూర్పుతో, 'ఈ ప్రపంచలో ఉండే అశాంతికి, అసౌఖ్యాలకు, రోగాలకు, అబద్ధాలకు, జరిగే ఘోరాలకు, హింసలకు, యుద్ధాలకు, మోసాలకు—అన్నిటికీ యీ సయన్సు, యీ న్యూస్ పేపర్లే కారణమని నమ్మండి!' అన్నాది ముక్కుపుటా లెగర వేస్తూ.

చెంపమీద చరచినట్లు నొచ్చాయి నా కామె మాటలు. విని కొంతసేపు ఆలోచిస్తూ ఊరుకున్నాను. సయిన్సు అంటే నాకు ఎంతో అభిమానము, భక్తిన్ని. వార్తాపత్రికల నెవరేమన్నా సరేకాని, సయిన్సును గూర్చి అన్యాయం మాటలాడితే నేను సహించలేను.

'లక్ష్మి, ఏదో ఒక్క విషయంగూర్చి నీకు ఒళ్లుమండినా, యిట్లా సయన్సు అంతటినీ తూలనాడడం ధర్మం కాదు. సరే, టెస్టుట్యూబ్ శిశువులగురించి నీవాదం కొంత సబబుగానే ఉన్నదని ఒప్పుకుంటాను. కాని నన్ను మరొక ఉదాహరణను చెప్పనియ్యి. అప్పుడు నీ అభిప్రాయం మారవచ్చు.' అన్నాను.

'చెప్పండి.'

'ఇప్పుడు క్రొత్తగా 'హార్మోన్ థియరీ' అని ఒకటి అమలులో ఉందిలే. అది యేమిటీ అంటే,—' అని ప్రారంభించాను.

సన్నని చిరునవ్వుతో, 'ఆ థియరీయేదో అంతా నాకు చెప్పి ఇప్పుడు తలనొప్పి పుట్టించనక్కరలేదు. మీ పుణ్యముంటుంది, టూకీగా దాని పర్యవసానమో, ఫలితమో నిరూపించే ఉదాహరణలు రెండు చెప్పండి; చాలును.' అన్నాది లక్ష్మి.

సరే అని, లోగడ నేనెప్పుడో 'నాష్' పత్రికలో చదివిన గోవిందబిహారీలాల్ గారి వ్యాసంనుండి కొన్ని ఉదాహరణలు ఎంచి చెప్పినాను.

'ప్రపంచంలో ఏయిద్దరు మనుషులూ సమానలక్షణాలు గలవారుగా ఉండరు. మనిషికీ, మనిషికీ బోలెడు తేడా ఉంటుంది. ఈ తేడాలను కలుగజేసే పదార్థాలు కొన్ని మన శరీరంలో ఉంటాయి. వాటిలో కొన్నిటిని హార్మోన్స్ అంటారు. ఇప్పుడు గొప్పగొప్ప దేశాలలో డాక్టర్లు 'హార్మోన్ చికిత్స'లతో అద్భుతమైన పనులు చేస్తున్నారు. రెండుమూడు చినుకుల హార్మోన్‌ను రక్తంలోనికి 'ఇంజెక్టు' చేసి రోగియొక్క శరీరాన్ని, స్వభావాన్నికూడా మార్చివేయ గలుగుతున్నారు.

'ఈమధ్య 'లారీ' అనే అమెరికన్ డాక్టరొకడు చిత్రమైన కేసొకటి చెప్పినాడు. ఒకానొక స్కూలు బాలుడు తల్లిదండ్రులకు అసాధ్యుడై తుంటరిగా ప్రవర్తిస్తూ ఉండేవాడట. ఇంట్లోని డబ్బులు, తినుబండారాలు దొంగిలించేవాడట. అన్నీ అబద్ధాలే చెప్పేవాడట. ఇల్లుతీసి పందిరివేసే పాడుపనులు చేసేవాడట. తోడిబాలురను చితకదన్నేవాడట. పెద్దవాళ్ళచేత చచ్చే దెబ్బలు తినేవా

డట. ఉపాధ్యాయులు, తలిదండ్రులు చెప్పే ఉపదేశాలకు, విధించే శిక్షలకు ఏమీ లక్ష్యపెట్టేవాడు కాడట. డాక్టరు గారి ఆ అభ్యాయిని పరీక్షించి, కుర్రవాడు దుబ్బుగా, పొట్టిగా, ఆడంగిగా ఉండడం కనిపెట్టి, వెంటనే హార్మోన్ చికిత్స ప్రారంభించినాడు. ఆ అభ్యాయిలో అప్పుడు అద్భుతమైన మార్పువచ్చింది. లావుగా, కురుచగా ఉండే వాడల్లా సన్నంగా పొడవుగా అయినాడు. వాడి నీచ గొంతుక, ఆడచేష్టలు, దొంగగుణాలు, పెంకెతనం అన్నీ నిర్మూలమైనాయి. కుర్రవాడు అన్నివిధాలా బాగుపడినాడు!

'ఈ హార్మోన్ చికిత్సవలన 'ఎడిసన్ వ్యాధి' వంటి అసాధ్యరోగాలు సహితం నిర్మూలిస్తున్నట్లు చెప్పున్నారు వైద్యులు. ఈమధ్య ఒకానొక అమెరికన్ ఆసుపత్రికి ఈ వ్యాధితో బాధపడుతున్నవాళ్లు కొందరు వచ్చి యుండిరట వాళ్లు తిండితినేవారు కారట. కృశించి నల్లగా అయినారట. మెదడు చెడిందట. ఎప్పుడూ బద్ధకంగా, స్పృహతప్పి, చచ్చినట్లుపడి ఉండేవారట. అప్పుడు డాక్టర్లు ఎవరికో సయింటిస్టులకు తంతియిచ్చి, విమానంమీద కొత్తగా 'వైటల్ హార్మోన్'ను తెప్పించి, రెండుమూడు చినుకులు శరీరంలోనికి యింజెక్టు చేసేసరికి. యీరోగులంతా లేచి కూచున్నారట. రెండు గంటలలోగా పూర్ణారోగ్యం కలిగి. బలమైన గొడ్డుమాంసం తిని జీర్ణించుకోదగ్గ శక్తి ఉదయించిందట!

'సహజంగా ఉండవలసిన వైటల్ హార్మోనులు వాళ్ల శరీరంలో నశించినందువల్లనే, వాళ్ళకా వ్యాధి వచ్చినదని

డాక్టర్లు కనిపెట్టినారు. ఒంట్లో యీరకం హార్మోన్‌లు లేకపోతే, రక్తంలోవుండే ద్రవపదార్థమంతా ఊటగా పైకివచ్చేసి, రక్తం పేరుకొనిపోయి, చావువస్తుంది.

'అయితే, ప్రాణతుల్యమైన యీరసాయనం మన శరీరంలో ఉండడం అవసరమేకాని, కాస్త అధికంగా ఉన్నాదంటే మళ్ళీ ప్రమాదమే. ఆడదాని శరీరంలో యీరకం హార్మోన్స్ జాస్తీఅయితే, ఆమెకు మగలక్షణా లంకురిస్తాయి. అంటే, గొంతుక బొంగుదేరడం, పై పెదవిమీద, గడ్డంమీద వెండ్రుకలు మొలవడం, ఒళ్ళు మోటుశారడం,—యిత్యాదివి. ఇంకా మన మన శరీరాలలో ఉండే మరికొన్నికొన్నిరకాల హార్మోనులమీద ఆధారపడి ఉంటాయి, మనలో ఉండే కొన్నికొన్ని ఆడలక్షణాలు, మగలక్షణాలున్ను. 'ప్రోలాక్టిన్' అనే హార్మోను మగవాళ్ళదేహంలో ఉండదు. ఆడవాళ్లశరీరంలో అది ఉండితీరుతుంది కనుకనే, వాళ్లకు చనుబాలు ఉంటాయి. ఈమధ్య డాక్టర్ రిడిల్ అనే ఆయన యీ హార్మోన్‌ను కొన్ని మగగిన్నిపందులకు యింజెక్టు చేసేసరికి, అవి ఆడపందులవలె పాలివ్వడం ప్రారంభించాయట!

'కేంబ్రిడ్జిలో ౩౪ ఏండ్ల వయసుగల ఒక కోడిపెట్ట పుంజుగా మారిపోయినదని వ్రాస్తున్నాడు డాక్టర్ హార్స్టు—దాని కండరాలలో ఒకదానియందు దేహో సంచలనం కలుగుటవలన పిల్లల తల్లిగాఉండిన ఆకోడి మగతనంపూని తిరిగీ పిల్లలతండ్రీ అయినదట!'

చేతిమీద గడ్డం ఆనుకొని బొమ్మవలె రెప్పవాల్చక

నన్నుచూస్తూ, శ్రద్ధగా విన్నాది లక్ష్మి.

'అయితే యికనేం? మనలోఉండే హార్మోన్స్ కూడా ఏదైనా గడబిడ చేశాయంటే, మనకూ సంభవించవచ్చునన్నమాట, యిట్టి సెక్స్ మార్పులు ?... కొంపదీసి ఏనాడో నిద్రలేచేసరికి మీరు హటాత్తుగా ఆడమనిషి అయిపోతే,...ఎట్లా?'అన్నాది విరగబడినవ్వుతూ.

'అయిపోనులే, బెంగపడకు !' అన్నాను నాకు కూడా నవ్వొచ్చి 'మనలో ఉండే హార్మోన్స్ అట్టి తల్లక్రిందు మార్పులను కలిగించవు. కాని కొంతవరకు మన మన సెక్స్‌గుణ తేడాలను నిర్ణయిస్తాయి.'

'అంటే' అన్నాది లక్ష్మి బొమలు పైకెత్తి.

'అంటే, వ్యక్తులయొక్క శరీరతత్వాన్ని బట్టి— అనగా, వారి రక్తంలోవుండే హార్మోన్స్‌వంటి రసాయనాల మూలాన—ఏమనిషిలో ఏయే ఆడలక్షణాలు, మగలక్షణాలు ఉండేటందుకు అవకాశం ఉన్నదో మనం తెలుసుకోవచ్చు. కొన్నికొన్ని పరీక్షలవలన ప్రతిమనిషిలోను గల ఆడతనాన్ని, మగతనాన్ని వివరంగా కొలవవచ్చును.' అని చెప్పాను.

'ప్రతీ మనిషిలోను ఆడహార్మోన్సు కొన్ని, మొగహార్మోన్సుకొన్ని, (అంటే, ఆయాలక్షణాలను కలిగించేవి) ఉంటా యన్నమాట ?'

'అవును. అట్లా మిశ్రమమై ఉండడమే శరీరారోగ్యానికి మంచిదికూడా !' అన్నాను.

'మగవాడికి కొంత ఆడతనం, ఆడదానికి కొంత

మగతనం, ఉండడమే మంచిదనా, మీ రనేమాట?'
అన్నాది లక్ష్మి, చిరునవ్వుతో.

'అదికాదు. మగవాడిని ఆడహార్మోన్లున్నూ, ఆడదానిని మగహార్మోన్లున్నూ, కొన్నికొన్ని వ్యాధులనుండి, యిబ్బందుల నుండి కాపాడుతూఉంటాయి. ఉదాహరణకి చెప్తున్నాను: 'హెమోఫిలియా' అనే రక్తస్రావవ్యాధివలన కొందరు పురుషులు బాధపడతారు. అట్టివాళ్లకు శరీరంమీద ఏ భాగమందైనా ప్రమాదవశాత్తూ చిన్నగాయం తగిలితే చాలు—రక్తం ఆగకుండా ధారకట్టి కారుతుంది; ఎంతి సేపటికీ పేరుకొని గడ్డకట్టదు. వెనకటి రష్యన్ రాకుమారులకు, స్పెయిన్ రాకుమారులకు యీవ్యాధి ఉండేదట. డాక్టర్లు అప్పుడు- ఈజబ్బు సాధారణంగా మగవాళ్లకే వస్తుందికాని ఆడవాళ్లకెవరికీ రాదు. ఎందుచేత? బహుశః, స్త్రీలను యీవ్యాధినుండి కాపాడడానికి వాళ్లరక్తంలో ప్రత్యేకంగా ఏమైనా హార్మోన్స్ వున్నాయేమో? ఒకవేళ ఆడహార్మోన్స్ కొన్ని యీ రాకుమారులకు, యింజెక్టుచేస్తే లాభం వుంటుందేమో?- అని ఆలోచించి హార్మోన్ చికిత్స ప్రారంభించారట. గారడీవలె జబ్బు వెంటనే నయమైనదట!' అని చెప్పాను.

'ఈహార్మోనులకథ నిజంగా అద్భుతంగానేఉంది!' అన్నాది లక్ష్మి, యేదో యోచిస్తూ.

నయన్సుయొక్క మహిమను ఆమెకు నచ్చచేయ గలిగినందుకు నాలో నేను గర్వపడ్డాను. నా ముఖమందు తాండవించిన సంతోషచిహ్నాలను గమనించి కాబోలు.

'—కాని, సయన్సునుగూర్చి నాకుగల అభిప్రాయాలను మార్చుకోవలసిన అగత్యం కనబడదు!...మీరు చెప్పే దల్లా సయన్సుకూడా మానవసౌఖ్యానికి అప్పుడప్పుడు కొంత తోడ్పడుతూ వుంటుందని; అంతేకదూ?...పాము విషంకూడా మానవుడికి అప్పుడప్పుడు వుపచరిస్తూ వుంటుంది!' అన్నాది చిరునవ్వుతో.

'సయన్సు అంతేనా?' అన్నాను నిర్ఘాంతపడి.

ఆమాటకు జవాబులేదు; ఒకటే నవ్వు!

నవ్వుచేత కొంతసేపు మాటతెమలక, పిమ్మట మళ్ళీ, 'అబ్బా! ఎంత గొప్పసంగతి కనిపెట్టారు మీ సయంటిస్టులు!...మొగవాడి రోగం ఆడదే కుదర్చాలన్న సంగతి యీనాటికైనా తెలుసుకున్నారు.—అదేంత కాదు?' అన్నాది విషయాన్ని మార్చేస్తూ.

ఆమాట విని పక్కున నవ్వాను.

అసలు విషయం విడిచి, మా సంభాషణ అంతటితో అరణ్యమార్గం పట్టింది. జపం విడిచి లొట్టలలో పడినట్లు, నేను చెప్పాలనుకున్న విషయాలు అన్నీ మరచిపోయి,...ఆమె ముద్దుమొగం, నవ్వుకళ్లూ చూస్తూ, ఆమె పెంకెమాటలను, నవ్వుతాలను వింటూ, ఆమె జడలోని గులాబీల మత్తువాసనలకు ఒళ్లే మరచిపోయాను!

---

# విమానం సరదా

అరణ్యాలమధ్య ఉన్న యీ పల్లెగ్రామానికి దొర లెవరో విమానంమీద వస్తున్నారని పురజనులలో ఒక విధమైన ఆరాటం, ఆందోళన, ఉత్సాహం బయలుదేరాయి. ఫిబ్రవరి 26 తేదీని పగలు పది పన్నెండుగంటల మధ్య భద్రాచలంలో ఎయిరోప్లేన్ దిగుతుందన్న వార్త కోయగ్రామాలకు కూడా మంటవలె గుప్పున వ్యాపించింది. ఎవరినోట విన్నా విమానం కబుర్లే! ఎవరి మొగంచూసినా, 'విమానం చూడబోతున్నాను,' అనే గర్వానంద సూచనలే! అవును, యీ అనాగరికగ్రామంలో, అమాయకులైన అడవిమనుష్యులకు విమానదర్శన మొక మహాభాగ్యమే. రాముడు వసించే పుణ్యభూమి గనుకనే యీ భద్రాద్రికి ఎయిరోప్లేన్ దర్శనయోగం నేటికైనా పట్టనున్నదని యిక్కడి పూజార్ల జయవాదన! విమానాలు దైవనిర్మితములనీ, వాటిని ఎక్కేవాళ్లు కేవలం దేవతాసమానులనీ, పామరులలో అనేకుల నమ్మకం. పదేళ్ళక్రిందట (౧౯౨౬-వ సం॥ లో) సర్ ఏలన్ కాబ్‌హామ్ అనే ఆంగ్లేయవైమానికుడు ఆఫ్రికా మీదుగా ఎగురుతూఉన్నప్పుడు, కొన్నికొన్ని పల్లెలలో అక్కడి జనులు కత్తులు, బల్లెములు పట్టుకొని మూగే

వారట విమానం వ్రాలేచోట—మేఘాలలోనుండి భూమి మీదికి ఊడిపడే ఆ తెల్లమనుషులు తమకు హానిచెయ్యడానికి వచ్చిన దెయ్యాలో, జంతువులో, యింద్రజాలికులో, రాక్షసులో, ఎవరో అని! అమాయకులగు యిక్కడి కోయలు ఆ'నీగ్రో'లవలె వైమానికులను రాక్షసులనీ, భూతాలనీ ఎదిరించక, మూఢభక్తితో దేవతలుగా భావించి పూజించడం కొంతవరకు నయమే!

'ఈ ఊరు పావనం అవుతుంది, ఆదొరల ధర్మమా అని,' అన్నాడు చదువుకున్న నామిత్రు డొకడు. నిజమే అనిపించింది నాకున్నూ, కొంత యోచనపైని. ఈకోయలు, ఏజెన్సీవాసులు మరొక విధంగా విమానాన్ని చూసేదెట్లా? మళ్ళీ యిట్టి అవకాశం ఎప్పుడు లభిస్తుంది వాళ్ళకు? నాగరికతనుండి దూరంగా విసిరివేయబడియున్న యీ మన్యస్థలవాసులకు కొందరికి రెయిలుబండీ అంటేనే తెలియదు! ఇక్కడి హైస్కూల్‌లో చదువుకునే కొందరు పెద్దక్లాసు విద్యార్థులు సహితం రెయిలుబండీ అన్నా, సముద్రం అన్నా, తెల్లమొగాలు వేసి చూస్తారు. అట్టి దండకారణ్యవాసులకు ఎయిరోప్లేన్ దర్శనమంటే నిజంగా సామాన్యవిషయం కాదు. మతిని చలింపజేసే అద్భుతానుభవమన్నమాట! జీవితమును ధన్యమొనర్పగల మహాయోగము వంటిది!.........

పోలీసులు, ఫారెస్టు వాళ్లు కూడి, ఊరుకు తూర్పున ఉన్న యిప్పసారా డిస్టిలరీకి సమీపంలో నేల సదును చేయించారు, విమానంవచ్చి వ్రాలడానికి. ఆ రాబోయే

దొరలు అడవులకు సంబంధించిన పెద్దఉద్యోగస్తులట!
కూలీలచేత తుప్పలు, పుట్టలు కొట్టించి, రాళ్లురప్పలు
పెరికించి, దిబ్బలు త్రవ్వించి, గోతులు పూడ్పించి, ఎత్తు
పల్లాలు లేకుండా యించుమించు ౫౦౦ గజాలమేర ఆవరణ
తయారుచేయించారు రేంజర్లు. రెండు గుడారాలు వేయిం
చారు. ఆవరణచుట్టూ తెల్లవి, ఎఱ్ఱవి గుడ్డజెండాలు
పాతించారు. మొత్తానికి వావిలిడొంకలతోను, ముళ్ళ
తుప్పలతోను పాడువడియున్న స్థలాన్ని అందమైన మైదా
నంగా మార్చి, కలకలలాడునట్లు చేయగలిగినారు.

నాడు మంగళవారం. స్కూలుకు సెలవుదినం
కాదు. మర్నాడు మాస్టర్లు శిక్షించినా సరేనని. బడిపిల్లలు
కొందరు స్కూలు ఎగవేసి, విమానం చూద్దామన్న సర
దాతో మైదానంవద్ద కాచుకొని కూచున్నారు సుమారు
౧౦ గంటలనుండీ. క్రమంగా ఊళ్ళోవాళ్ళు, చుట్టుపట్ల
గ్రామాలనుండీ వచ్చిన గొల్లలు, కోయలు, పిన్న, పెద్ద
అందరూ విమానం దిగే స్థలానికి సమీపంలో ఉన్న చెట్ల
క్రింద, తుప్పల నీడను, గట్లచాటున, గుంపులు గుంపులుగా
చేరుకున్నారు. విమానంనుండీ దిగేవారిని ఆహ్వానించడా
నికి ఊళ్ళో ఉన్న పెద్దలు, ఉన్నతోద్యోగస్తులు బళ్ళమీద,
మోటార్లమీద పదిన్నర గంటల సరికల్లా హాజరయి
నారు. మైదానం జనంతో నిండింది. ఎండవేడిమికి నెత్తి,
కాళ్ళు, కాలుతూ అవస్థపడుతున్నారు అందరును. చుట్టు
ప్రక్కల ఎక్కడా మంచినీళ్లయినా దొరికే అస్కారం
లేదు. కాని విమానం చూదామన్న కుతూహలంలో

జనులు యీ యిబ్బందులను వేటినీ లెక్క చెయ్యలేదు.

౧౧ గంటలకు యింకా పదిపన్నెండు నిమిషాలు ఉన్నదనగా ఊరుకు దక్షిణంవైపున జువ్వున చప్పుడు విన వచ్చింది. 'అదిగో. అదిగో.' అని గొల్లుమన్నారు జనులు. అంతరిక్షాన పక్షివలె మొదట చిన్నగా కనబడిన విమానం క్రమంగా దగ్గిరికివచ్చి గడబిడధ్వనితో బుర్రున డిస్టిలరీ వైపు ఒరుగుతూ లేస్తూ వడిగా సాగింది. తయారు చేయ బడిన సదునుస్థలంమీదుగా తాటిచెట్టు యెత్తున గ్రద్ద వలె గాలిలో ఒకసారి ప్రదక్షిణంచేసి, ఊగుతూ రాబం దువలె నెమ్మదిగా భూమిపై వ్రాలి, ముందుచక్రాలమీద శరవేగంతో కొంతదూరం పరుగెత్తి, నిల్చింది ప్లేను, జనులు మూగినవైపున్న డేరాకు మిక్కిలి దగ్గరగా. చూడడానికి వచ్చిన జనులు సంతోషంతో కిలకిలలాడుతూ విమానం చెంతకు జరిగారు.

విమానసారథి ఎవరెట్ అనే ఆజానుబాహుడైన తెల్లవారు. విల్సన్ దొరగారు, వారి సతీమణి, బెనర్జీ గారు- వీరు ముగ్గురే విమానంనుండి దిగిన ప్రయాణీకులు.

కొన్ని నిమిషాలవరకు మైదాన మొక పెండ్లిపందిరి వలె కోలాహలంతో ప్రతిధ్వనించింది- మాటలు, కేకలు, విమానం ముచ్చట్లు, నవ్వులు, పలకరింపులు, కుశల ప్రశ్నలు, మొదలైనవాటితో. చుట్టూ మూగిన జనం ప్లేనును సమీపంనుండి చూడడంతో తృప్తిపడక, దాన్ని తాకి, నాలుగువైపులా పరీక్షించి, అన్నీ శోధించి, దానిని గురించి వ్యాఖ్యానాలు ప్రారంభించారు. 'మీదపడి బాడిని

తాకవద్దు. ఎడంగా జరగండి!' అని పోలీసుల మందలింపులు జనుల కోలాహలాన్ని మించి, అప్పుడప్పుడు విన వచ్చేవి.

విమానాన్ని గూర్చి ఎవరికి తోచిన విషయాలు వాళ్ళు యాకరుబెట్టేవారు. నిజంగా దానిసంగతి తెలిసిన వాళ్లు కొందరు, పుస్తకాలలో చదుకున్న ముక్కలవలన అంతో యింతో గ్రహించుకున్నవాళ్లు కొందరు; కేవలం తమ ఊహాశక్తి మీదనే ఆధారపడి అన్నీ తెలిసినట్లు గోతాలు కోసేవాళ్లు కొందరు,—అన్ని రకాలవాళ్లు ఉన్నారు ఆమూకలో.

పొట్టకూటికి యీ అడవిఊళ్ళో చిక్కుకొని, రెయిలుకూత వినడానికైనా నోచుకోక, మనోతనువులను ఏజెన్సీగాలిలో హారతికర్పూరంవలె హరింపజేసుకుంటూ, జీవితోత్సాహాల నణచుకుంటూ, నాగరికతకు నూతనానుభవాలకు దూరమై, ద్వీపాంతరవాసఖైదీవలె నిరుత్సాహజీవనం గడుపుతూ ఉన్న నాకు మాత్రం ఎయిరోప్లేన్ చూడడమంటే సరదాకాదూ? బొమ్మలలోను, సినిమాలలోను తప్ప నేనిదివరలో విమానం చూసిఉండలేదు! విమానాలగూర్చి నాకు అడవిమనుష్యులవలె విపరీతాభిప్రాయాలు, మూఢనమ్మకాలు లేకపోయినా, మానవుడు పిట్టవలె గాలిలో తేలుతూ ఎగరడమనే అద్భుతవిషయం ప్రత్యక్షంగా చూసి ఆనందించవలెనన్న కుతూహలం మాత్రం మెండుగానే ఉండెను.

నూర్జాలు శాలుని సరదాతో విమానంవద్దకువచ్చి,

ఒళ్ళంతా కళ్ళుచేసుకొని చూశాను దాన్ని. విమానాల భోగట్టా కొంత తెలిసిన ఒకమిత్రుడు దాని కిటుకులన్నీ నాకు చూపించి, దాని తోక పక్షిన చుక్కానీ వంటిదనీ, తెల్లగా వెండివలె మెరుస్తున్నదాని రెక్కలు పట్టుగుడ్డతో చేయబడినవనీ, దాని పెట్రోల్‌టాంక్ పాతిక గాలన్లు పట్టుననీ, పైలట్‌కూ ప్రయాణీకులకూ మధ్య ఒక టెలి ఫ్లాన్ కలదనీ, ఏమేమో బోధించాడు.

ఇంతలో బెనర్జీగారు ఎవరితోనో సంభాషిస్తూ ఉంటే, మరికొన్ని వివరాలు నాచెవిని పడ్డాయి.

'ఇప్పు డెక్కడనుండి రాక ?'

'గన్నవరంనుండి.'

'ఈ ఊరునుండి మళ్ళీ తిరుగుప్రయాణ మెప్పుడు?'

'ఎల్లుండి గురువారంనాడు.'

'అంతవరకూ యీప్లేను యిక్కడపడి ఉండవలసిన దేనా ?'

'లేదు. ఇప్పుడు వెంకటాపురం పోయి నూగూరు ఫారెస్టు యావత్తూ చూసి, వెంటనే తిరిగివస్తాం. రేపు లక్కవరం అడవుల తణిఖీకి వెళ్ళిరావలసిఉంది.'

టాంక్‌లో సారథి పెట్రోల్‌పొయ్యడం, యింజన్ కప్పు తెరచి కందిరినూనె వెలపడం, మొదలైన దృశ్యా లలో నిమగ్నుడనై, తక్కిన సంభాషణను నేను వినిపిం చుకోలేదు.

ప్లేనుకు దగ్గిరగా నిల్చున్నాను చుట్టూ పోలీసు అధికార్లు, ఫారెస్టు ఉద్యోగస్తులు మూగిఉన్నారు. చెంతను

విల్సన్ దంపతులు తమ నెదుర్కొనవచ్చిన ప్రీస్ట్లీ సతితోను, ఆమె కవలబిడ్డలతోను నవ్వుతూ సంభాషిస్తున్నారు. ముద్దులు మూటగట్టే ఆపసిబాలికలవేపు చూస్తూ విమానం సంగతే మరచిపోయి, పరధ్యానంగా నిల్చున్నాను నేను. చుట్టూ ఉన్న జనుల సంభాషణ వాక్యా లెవరివీ నాకు వినరాలేదు.

కొంతసేపటికి, '—అయితే మాకు సరదా ఎగుర్లు యివ్వడ మెప్పుడు?' అని విల్సన్‌గారితో అంటూ ఉన్న ప్రీస్ట్లీ సతి మాటలు అప్రయత్నంగా నా చెవుల పడ్డాయి.

'మేం మూడుగంటల సరికల్లా తిరిగి వచ్చేస్తా మనుకుంటా. సరదా అయితే అప్పుడు ఎగరవచ్చు...'

అంటూ విల్సన్‌గారు నా వేపు తిరిగి, 'మీరిదివరలో ఎప్పుడైనా విమానం ఎక్కి ఉంటిరా?' అని ప్రశ్నించారు.

'లేదు.' అన్నాను నేను నవ్వుతూ.

'ఎగురుదామని కుతూహలంగా ఉన్నదా?'

'చాలా!'

'అయితే సాయంత్రం మూడుగంటల తరవాతనే...'

మరికొంతసేపటికి ప్రీస్ట్లీసతి అమ్మాయిలను తోడ్కొని కారులో వెళ్లిపోయింది. విల్సన్ దంపతులు, బెనర్జీ గారు, పైలట్ దొర, చెంతనున్న గుడారంలో ప్రవేశించారు, అల్పాహారం, తీసికొనే నిమిత్తమై.

మిత్రులతో ప్రసంగిస్తూ విమానంనీడనే నిల్చున్నాను నేను. ఎట్లాగైనా యీ విమానంపైని ఎక్కి ఎగ

రాలన్న కోరిక అప్పుడు క్రమంగా బలపడింది నాలో. నా ఉబలాటం చూసి, నామిత్రుడు పోలీసు డెప్యూటీ తనలో నవ్వుకున్నాడు.

'ఇంతకూ పైలట్ ఏమంటాడో కనుక్కోవద్దూ?' అంటూ ఆయన గుడారంనుండి మావేపు వస్తూఉన్న బెనర్జీగారితో యీవిషయమై ప్రస్తావించారు.

'ఈవాళ కాదు; రేపుఉదయం, అంటున్నాడు ఎవరెట్ దొర. మైదానం సదునుగా, క్షేమంగా లేదట! ఒకటి రెండుచోట్ల మెరకలు కొంచెం తవ్వించవలసివుంది.' అన్నారు బెనర్జీగారు.

ఇంతలో పోలీసులు జనాన్ని దూరంగా తొలగమని నిర్బంధించారు. ఒక ఫర్లాంగు దూరంలో మేసుకుంటూ వున్న రెండు ఎడ్లను సహితం ప్రక్కకు తరిమివేశారు. మైదానం పొడుగున కనుచూపుమేర పిట్ట మనిషికాని, జంతువుకాని, మరియే యితర ఆటంకం కాని లేదు.

ప్లేనుకు ముందువైపున చాచిన చేతులవలె అమర్చబడియున్న ప్రొపెల్లర్ రెక్కను గిర్రున త్రిప్పినాడు పైలట్. కంటికి ఆనని వేగంతో చక్రంవలె అది తిరుగుట మొదలిడగానే, యింజనుమ్రోత వినవచ్చింది. చెవులు బ్రద్దలు చేసే చప్పుడది. విల్సన్ దంపతులు, బెనర్జీగారు ప్లేనులో సుఖాసీనులైనారు. తలుపుమూసి, గడియ బిగించినాడు పైలట్. ఇంజన్ మ్రోత వింటూ క్షణ మాగి, పిమ్మట పైనుండి యెక్కి తనస్థానమున కూచున్నాడతడు.

ధూళి రేపుతూ ప్లేను కదిలి, చక్రాలమీద ముం

దుకు పరుగెత్తింది మహావేగంతో. సుమారొక ఫర్లాంగు మేర ఆవిధంగా భూమిమీద పరుగెత్తి, క్రమంగా గాలిలో పైకి తేలిపోయింది. మరుక్షణంలో తలలు పైకెత్తి, ఆకాశంవేపు చూస్తూ నిల్చున్నారు జనం. అంతకంతకూ యింకా యెత్తుగాలేచి, ఊరుమీద ఒక రౌను తిరిగి, ఉత్తరముఖంగా సాగి, క్షణంలో అదృశ్యమైంది ప్లేను!

మధ్యాహ్నం 3 గంటలకు కాని తిరిగి రాదనుకున్న ప్లేను రెండున్నరకే వచ్చేసింది. మైదానం మీద అప్పుడు జనం అట్టేలేరు. కాని ఎండ చల్లబడిన తరవాత మళ్ళీ ఊళ్లోవాళ్లు తీర్థప్రజలవలె బయలుదేరారు విమానంవద్దకు, స్త్రీలను పిల్లలను వెంటబెట్టుకొని. చుట్టుప్రక్కల ఊళ్ళకు రోజూ ప్రయాణంచేసే మోటారుబస్సులు నాడు సర్వీసు మానుకొని, ఆమైదానంవద్దకు పదేపదే తిరిగేవి జనాన్ని ఎక్కించుకొని. ప్రొద్దుగ్రుంకేదాకా కాలినడకను, బండ్ల మీద, మోటార్లమీద, సైకిళ్ళమీద జనులు గుంపులు గుంపులుగా వచ్చి చూశారు విమానాన్ని. నేలపాతిన కొయ్యలకు సన్నని మోకులతో బంధింపబడిన ఆప్లేనువద్ద కొందరు పోలీసుజవాన్లు కాపలా ఉన్నారు. సర్కస్‌వాళ్లు పులులను, సింహాలను చూపించినట్లు ప్లేనుచుట్టూ ఒక తెరకట్టి, లోనికివచ్చి చూడడానికి మనిషికి అర్ధణా టిక్కెట్టు అని ఉంటే, నాడు నిజంగా ఎంతడబ్బు వచ్చి యుండునో...

సరదా ఎగుర్ల మాట రూఢిగా కనుక్కుందామని మర్నాడు ఉదయం పోలీసుడెప్యూటీగారి బంగాళాకు

బయలుదేరాను—బెనర్జీగారు, పైలట్ద్వార ఎవరెట్ గారు అక్కడే బస అని తెలుసుకొని.

'...విన్నారా యీసంగతి! నిన్న నూగూరు అడవులలో గడబిడచేసిందట ప్లేను!' అన్నారు నాయుడు గారు నాతో.

'నన్ను నిరుత్సాహపరచి, విమానం ఎక్కనియ్యకుండా బెదిరించాలనా యీ పోలీసు యెత్తు?' అన్నాను నవ్వుతూ.

'చా, కాదు. ఆ అడవులలో చుట్టూ పేళ్లు కాలుతూ ఉండెనట. ఆ వేడిగాలికి ప్లేను కొంచెం తబ్బిబ్బు అయిందట! ఏదో విపరీతం జరుగుతుందనే అనుకున్నారట బెనర్జీగారు. కాని అదృష్టవశాత్తూ...'

ఇంతలో ఎవరెట్గారు మేడదిగివచ్చారు.

'...మా సరదా ఎగుర్లమాట యేం చేశారు?' అన్నారు నాయుడుగారు పైలట్తో.

కొంచెం సంశయిస్తూ, 'ఆమైదానం అట్టే బాగు లేదు. ప్రమాదకరమైన ఎత్తుపల్లాలు ఉన్నాయి. కొన్ని కొన్నిచోట్ల యింకా బాగా సదునుచేయిస్తేకాని,...' అన్నారాయన.

'ఇప్పుడక్కడ కూలీలు పనిచేస్తునే ఉన్నారు. సాధ్యమైనంతవరకు సదునుచేయిస్తాం యీ పూట.' అన్నాడు చెంతనేవున్న రేంజరు.

'ఇప్పుడు గాలికూడా అనుకూలంగాలేదని తోస్తుంది.' అన్నాడు ఒక మిత్రుడు, మహా తెలిసినవాడివలె.

'గాలిమాటకేం, అది అంతయిబ్బంది విషయం కాదు. కాని నేలసంగతి ముఖ్యం.' అన్నారు ఎవరెట్‌గారు ఏదో యోచిస్తున్నట్లుగా సిగరెట్ను అదిమి పీలుస్తూ.

'సాధారణంగా ఎంతపొడుగు ఉంటే సరిపోతుంది, సదునుస్థలం?'

'౫౦౦ గజాలు.'

'వెడల్పో?'

'న్యాయం పట్టి పొడవు, వెడల్పు సమానంగా ఉన్న చదరపు స్థలమైతే సదుపాయంగా ఉంటుంది. అప్పుడు ఏవైపునుండి దిగడానికైనా వీలుగావుంటుంది.'

'ఏక్కేటప్పుడు ఎన్నిగజాల పరుగులో పైకి లేస్తుంది ప్లేను?'

'పరిస్థితులను పట్టి వుంటుంది ఆవిషయం' అన్నారు ఎవరెట్‌గారు. 'గాలి అనుకూలంగా వుంటే, నిండుబరువుతోనైనా రెండుమూడువందల గజాలలో తేలిపోతుంది. స్థలంబాగుండి, ప్లేన్‌లో అట్టే బరువు లేనప్పుడు యింకా తక్కువదూరంలోనే లేచిపోతుంది. ప్రయాణీకులు లేని ఖాళీప్లేన్ అయితే ౫౦ గజాలలోనే తేల్తుంది!'

మొత్తానికి పైలట్‌తో అప్పటి మా సంభాషణ వలన తేలిన సారాంశం ఏమిటంటే, సరదా ఎగుర్లమాట సందేహాస్పదమని!

'అయినా సాయంత్రం చూదాం' అన్నాడాయన శాస్త్ర ఆశనిస్తూ.

నాకు యించుమించు ౧౧ గంటలప్పుడు లక్కవరం

అడవులకు బయలుదేరింది ప్లేను. మధ్యాహ్నం ఒంటి గంట
న్నర కల్లా తిరిగి వచ్చింది.

ఆ సాయంత్రమైనా సరదా ఎగుర్లు లభిస్తాయేమో
అని ఆశపడ్డాను నేను. ఎంత చార్జీ అయినా యిచ్చి, ఒక
సారి ఎగురుదామని నామిత్రు లనేకులు కుతూహలపడ్డారు.
కాని చావుకబురు చల్లగా చెప్పినట్లు, సూపరెంటు
నాయుడుగారు ఉన్నసంగతి తేల్చివేశారు.

'సమను స్థలం సురక్షితంగా లేదంటున్నాడు
పైలట్ !'

'అయితే మా ఆశలన్నీ గాలిలో మేడలే అయిన
వన్నమాట!' అన్నాను నేను, ఏడవలేక నవ్వుతూ.

'పోనీ, అంతసరదా అయితే రేపు ఈ ప్లేనుమీద
ఏకంగా చెన్నపట్నమే వెళ్ళరాదూ?' అన్నారు నాయుడు
గారు.

'నాకు అర్థంకాలేదు మీరనేమాట.' అన్నాను
కలవరపాటుతో.

'రేపు ఖాళీప్లేను చెన్నపట్నం పోతుంది. విల్సన్
దంపతులు, బెనర్జీగారు యిక్కడే ఆగిపోతారు. తిరుగు
ప్రయాణంమీద ఖాళీగా ప్లేను ఎట్లాగా చెన్నపట్నం
పోవలసిఉంది గనుక, కొంత తగ్గింపుచార్జీకి మిమ్మల్ని
ఎక్కించుకుందుకు ఒప్పుకోవచ్చును పైలట్!'

'మరి ఆసంగతి రూఢిగా కనుక్కొని నాకు తెలియ
జేస్తారా?'

'పైలట్ సరేఅంటే, మీరు ప్రయాణానికి సిద్ధ

మేనా ?' అన్నారు నాయుడుగారు నవ్వుతూ.

'ఓ, సిద్ధమే !' అన్నాను, తొణుకూ బెణుకూ లేకుండా.

'అయితే, ఏదో ఒకవిధంగా మీప్రయాణంకుదిర్చి తీరాలి !' అన్నారాయన చిరునవ్వుతో.

ఇంటికివచ్చి నేను పిల్లలతో నా ప్రయాణంగూర్చి చెప్పేసరికి, నాభార్య నన్ను వేళాకోళం చెయ్యడం ప్రారంభించింది.

చివరకి ఆమె, 'సరదా ఎగుర్లఘార్సు చాలకనా ?' అన్నాది నవ్వుతూ.

'అదిగో, అప్పుడే చల్లచుక్క వేలుస్తున్నావూ ?'

'లేకుంటే, పోలీసుస్నేహితుల మాట నమ్ముకోవడమేమిటి మీరు ! ఆయన హాస్యానికి ఏదో అని ఉంటారు.'

'సరే, ఏసంగతీ త్వరలోనే తెలుస్తుందిగా ? రాత్రి ౮ గంటలకి కాయో, పండో తెమిలిపోతుంది. వివరంగా అన్ని సంగతులూ కనుక్కొని అప్పుడు కబురు చేస్తానన్నారు ఆయన.' అన్నాను నేను.

చిరునవ్వుతో, నామాటలయందు నమ్మకం లేనట్లుగా నావేపు అట్టేచూసి, బదులు పలకకుండా ఊరుకుంది లక్ష్మి.

...రాత్రి ౯ గంటలయింది. పిల్లలంతా హాయిగా పడుకున్నారు. నాయుడుగారి వద్దనుండి ఏవర్తమానం రాలేదు. ఏదోపుస్తకం పట్టుకొని చదువుతూ కూచున్నాను, కాని ధ్యానమంతా విమానప్రయాణం మీదనే

ఉండేను. మధ్యమధ్య లక్ష్మి తన మెగతాళి ప్రశ్నలతో నన్ను విసిగించి, అల్లరిచేసేది. గడియారం ౧౦ గంటలు కొట్టిన పిమ్మట యిక ప్రయాణం సంగతి పూర్తిగా నిరాశ చేసుకొని, వీధితలుపులు మూసివచ్చి పడుకున్నాను.

'మీకు పిచ్చియెత్తుతున్నట్లుంది! ఎందుకీ లేనిపోని ఆరాటం? విమానం సరదా యిక జీవితమధ్యమందు తీర్చుకోలేక పోతారా! ఈసారి సెలవులలో దిగువకు వెళ్ళినప్పుడు అన్ని సరదాలు తీర్చుకోవచ్చును...ఇంతకూ యిప్పుడు చెన్నపట్నందాకా ప్రయాణమెందుకు? డబ్బు దండుగకు తప్ప!' అని క్షణం ఊరుకొని, 'బేర్వంవస్తే ఏనుగుపిల్లను కొనేతత్వం మీది!...నామాట విని మరి యీప్రయాణం ఊసు తలపెట్టకండి ఎవరైనా వింటే నవ్విపోతారు.' అంటూ చిన్నపిల్లలకు బోధించేటట్లుగా ఉపన్యాసం ప్రారంభించింది లక్ష్మి.

'తుదకు నీ కోరికే చెల్లిందిగా! ఎలాగాలేని ప్రయాణానికి ఎందుకీసాధింపు!' అన్నాను లేని నవ్వు తెచ్చుకొని.

'నిజంగా గాలిప్రయాణమంటే ఎందుకో మీకీ సంబరం నాకు తెలియకుండా ఉంది.'

'ఏం? ఏదైనా ప్రమాదం వస్తుందేమో అనా నీ భయం? నీకు అంత అయిష్టం, బితుకు, అని తెలిసి ఉంటే—'

'అబ్బే, అట్టిదిగులు నాకెన్నడూ లేదు. రావలసిన యోగం ఉంటే, ప్రమాదాలు విమానం యెక్కితేనే

రావాలా యేమిటి? ఆమాటకొస్తే, బస్సు ప్రయాణాల కంటె, పడవ ప్రయాణాలకంటె, గాలిప్రయాణంలోనే ప్రమాదాలు తక్కువ!'

'ఆమాత్రం ధైర్యం, యోచనాశక్తి గలదాన వైతే మరి నా ప్రయాణానికి ఎందు కభ్యంతర పెడుతున్నావు?' అని అడిగాను.

'నేనేమీ అభ్యంతర పెట్టలేదు. కాని జరగని తలపులు, తీరనికోర్కెలు పెట్టుకోరాదని మనవిచేస్తున్నాను. అంతే.'

నాడు మా ఉభయులకూ నిద్రపట్టేసరికి సుమారు ౧౧ గంటల రాత్రి అయివుంటుంది.

ఏవరో నన్ను పిలుస్తున్నట్లు అర్ధరాత్రివేళప్పుడు వినవచ్చింది నాకు. లేచి తలుపుతీసేసరికి లాంతరు పట్టుకొని గుమ్మంవద్ద నిల్చున్నాడొకడు

'ఎవరు నువ్వు?'

'నూపరెంటు దొరవారు మీకీ ఉత్తరం యిచ్చి, జవాబు తెమ్మన్నారండి.' అంటూ వాడు నాచేతి కొక చీటి యిచ్చినాడు.

అందు తొందరతో వ్రాసినట్లున్న నాయుడుగారి పంక్తులివి:—

'చెన్నపట్న ప్రయాణం కుదిర్చినాను. ఉదయం ౯-౧౦ గంటలకు బయలుదేరుటకు సిద్ధముగా ఉండవలెను...'

రాత్రంతా యిక ఒళ్లుమరచిన నిద్రపట్టలేదు నాకు. అడుగడుగుకీ మెలకువవచ్చేది. ఏవేవో తలపులతో, పిచ్చి

కలలతో, పాన్పుమీద యిటూఅటూ దొర్లుతునే ఉం టిని. వేకువజామునమాత్రం కొద్దిగా కునుకుపట్టినట్లుంది.

కారువచ్చి గుమ్మంలో ఆగిన చప్పుడు విని త్రుళ్ళి పడి లేచాను. అప్పటికప్పుడే సూర్యోదయసమయం కావ చ్చింది.

'ఏం? ప్రయాణసన్నాహంలో ఉన్నట్లేనా?' అని పలకరించారు నాయుడుగారు, చిరునవ్వుతో.

'సన్నాహాని కేమున్నదిగనుక? ఎప్పుడంటే అప్పు డే సిద్ధం నేను.'

'ఎలాగైతేనేమి, మీసంకల్పం సిద్ధించింది తుదకు. ఇట్టి అవకాశం మళ్ళీ యిక ఎవరికీ దొరకదు. నాకుకూడా చెన్నపట్నం రావాలని ఎంతో కోరికగాఉంది.'

'అయితే యికనేం? రండి.'

పెదివి విరిచి ఆయన, 'సెలవుదొరకదు.' అన్నారు నిట్టూర్పుతో.

సామాను అట్టే పట్టుగోవద్దనీ, మంచినీళ్ళ తిత్తి ఒకటి మరచిపోవద్దనీ, తనవద్దనున్న దూరదర్శనియంత్రం తీసుకోపొమ్మనీ, యింకా మేవేవో సలహాలుయిచ్చారు ఆయన.

'సరిగా ఎన్నిగంటలకు బయలుదేరడం?'

'౧౦ గంటలకు అని అంటున్నాడు పైలట్. కాని, ...సరే, ఎప్పుడైతేనేం? మీరు భోంచేసి సిద్ధంగా ఉం డండి. ఆవేళకు నేను నాకారు పంపుతాను,'

ఉదయమే అని అనుకున్న ప్రయాణం మధ్యాహ్న

నికి చేకిరింది. 'ఒంటిగంటకు' అని కబురువచ్చింది నాకు. నా ప్రయాణంవార్త ఊరంతా ఆబాలగోపాలమూ తెలిసింది, ఎండను లక్ష్యపెట్టక అనేకులు మైదానంవద్ద చేరినారు.

బంధుమిత్రసకుటుంబసపరివారసమేతుడనై ఒంటిగంటన్నరకల్లా ప్లేనువద్దకు వచ్చానునేను. అక్కడ చూడడానికి వచ్చిన జనమేకాక, ఒక సోడాషాపు, ఒక కిల్లీ దుకాణంకూడా ప్రత్యక్షమైనాయి. మిత్రులతో సంభాషిస్తూ కొంతసేపు గుడారంలో విశ్రాంతిగా కూచున్నాను. పిల్లలు సమీపంలో తనస్నేహితురాండ్రతో ముచ్చటిస్తూ ఉన్న లక్ష్మివద్దనుండి నావద్దకు, నావద్దనుండి ఆమెవద్దకు కిలకిల పరుగులెత్తుతూ ఆడుకుంటున్నారు.

ఆమెతో. 'మీరు, పిల్లలుకూడా ఎగిరితే బాగుండేది.' అని ఎవరో ఒకఆమె ఉత్సాహంతో అంటున్న మాటలు వినిపించాయి నాకు.

'ఈ ఆటంకమే లేకపోతే, తప్పకుండా ఎగిరి ఉందును. నిండునెలలు కదాఅని భయం!' అన్నాది లక్ష్మి ముసిముసి నవ్వుతో.

ఇంతలో విల్సన్ దంపతులు, బెనర్జీగారు, పైలట్ దొర వచ్చినారు. అప్పటికి పావుతక్కువ ౨ గంటలు అయిఉండెను.

అందరం ప్లేనువద్ద చేరినాము. మిత్రులందరివద్దా సెలవుపుచ్చుకొని, మహాఉత్సాహంతో యిక ప్లేనులో ప్రవేశించనున్నాను. బెనర్జీగారు, విల్సన్‌గారు నాతో

హెచ్చరిక మాటలేవో చెబుతూ, కాబిన్ తలుపులు ఎట్లు మూసి ఊడిపోకుండా గడియవేసుకొనవలెనో, మైకా కిటికీలు ఎట్లు తెరచుకొనవచ్చునో, ప్లేను ఎగురుతూ ఒకవైపుకు ఒరిగినప్పుడు నా స్థానమందు నేను ఏవిధంగా సర్దుకొని కూచుంటే సదుపాయమో, అన్నీ చూపించి బోధించారు.

'ఇదే తొలిసారి యెగరడంకదూ? ఏమీ ఫరవా లేదు...మంచి కులాసాగా ఉంటుంది.' అన్నారు విల్సన్ గారు ప్రోత్సాహస్వరంతో.

నవ్వులాటకు చాటుగా నాతో, '...వీలురాసి ఉంచినారా!' అన్నారు బెనర్జీగారు పకపక నవ్వుతూ.

'అట్టి అగత్యం రాకూడదు మరి,...'అన్నాను, నాకూ నవ్వువచ్చి.

'అన్నట్లు, ఆ కాబిన్‌లో కొన్ని కాగితంసంచీలు భద్రపరచబడిఉన్నాయి, చూశారా?...వాటి ఉపయోగం తెలుసునుకదూ!'

'తెలుసు. కాని వాటి అవసరం పడదనీ—పడకూడదనీ—నా నమ్మకం! అయినా, వాటిసంగతి నాకు జ్ఞాపకం చేసినందుకుగాను మీకు నా మనఃపూర్వక వందనాలు.' అన్నాను.

ఇంజను స్టార్ట్ అయింది. ప్లేనంతా సన్నని కుదుపుతో తోకవరకూ గజగజలాడుతూ ఉంది. చుట్టూ ఉన్న జనులు దూరంగా తొలగిపోతున్నారు.

'ఊం...త్వరగా తెమిలి ఎక్కండిమరి.' అన్నారు

నాయుడుగారు నా భుజంమీద చనువుగా తట్టుతూ.

'తొందరలేదు. ఇప్పుడప్పుడే కదలిపోము యింకా.' అన్నాడు పైలట్.

మిత్రుల నొక్కొక్కరివద్దనే సెలవుదీసుకున్నాను,

'అమ్మా, పోయివస్తాను, సెలవు !' అన్నాను నాయుడుగారి సతీమణితో.

'మంచిది. క్షేమంగా తిరిగిరండి.' అని ఆశీర్వదించింది ఆమె.

చెయ్యిచ్చి, దయతో నాకు సెలవొసగుతూ, 'మీ భార్యావద్ద సెలవుదీసుకున్నారా ?' అని అడిగింది, మందహాసంతో విల్సన్ సతి.

ఆంగ్లేయపద్ధతి ననుసరించి, యిందరిలోను నేను నా లక్ష్మిని కౌగలించుకొని, ముద్దులతో సెలవుదీసుకొనవలెనని కాబోలు ఆమె ఊహ ! మనస్సు ఎంత ఆరాటపడ్డా అట్లా చేయడానికిమాత్రం ధైర్యంచాలలేదు నాకు.

'లక్ష్మీ, పోయిరానా మరి ?...' అన్నాను నా కామెయెడల గల ప్రేమానురాగాన్ని కళ్ళతోమాత్రం ప్రకటించుకొని.

మనసులో ఆ ఆఖరునిమిషమందు హటాత్తుగా పొంగుకొచ్చిన దిగులును, అధైర్యాన్ని కొంత కష్టంమీద అణచుకుంటూ చిరునగవుతో నాకు సెలవొసగి, 'అక్కడ చేరినవెంటనే నాకు టెలిగ్రాం యివ్వండి.' అన్నాది లక్ష్మి అస్పష్టస్వరంతో.

తల్లికి మిక్కిలి దగ్గరగా మూగినిల్చున్న పిల్లల

వైపు మరొకసారిచూసి, నవ్వుతూ చేయి ఊపి, విమాన మెక్కి కూచున్నాను.

ఎడంగానిల్చుని ఛాయాయంత్రాన్ని సరిచూస్తూ విల్సన్ గారు నాతో, 'ఆ కిటికీ మరికొంచెం తెరచి, యిటు చూడండి. ఫోటో తీస్తున్నాను.' అన్నారు.

మరుసటి క్షణమందు 'సెలవు' అంటూ అందరి వైపూ చెయ్యిఊపుతూ 'త్రాటిల్' తెరచినాడు పైలట్. ప్లేనుకదలి త్వరితగమనంతో ముందుకుసాగింది చక్రాల మీద. మైదానం మిక్కిలి సమనుగా లేదన్న విషయం అప్పుడు అర్థమైంది నాకు. ఎత్తు పల్లాల మీదుగా కెరటములపై వలె ముంచుకు దూకుడుగా చక్రాలపై జారునట్లు దొర్లుతూ కొంతదూరం పరుగెత్తి, క్రమంగా త్వరలోనే పైకి తేలిపోయింది ప్లేను. భూమితో సంబంధం త్రెంచుకొని, సజీవంగా స్వర్గంవైపు గాలిలో ఎగిరిపోతూవున్న నా కానిమిషంలో చెప్పనలవికాని ఆనందం, విస్మయం, తన్మయత్వం కలిగాయి! గ్రుడ్డునుండి పొదుగబడిన పిమ్మట, అదే తొలిసారి తన రెక్కలప్రభావాన్ని తెలిసికొనగలిగిన పక్షికి ఎట్లుండునో, నాకును ఆ వింత యనుభవమట్లేయుండెను. అందు హాయి, బెదరుపాటు, నూతనత్వము, ఉత్సాహము, ఉద్రేకము— అన్నియు మిశ్రమమై యుండెను!

ప్లేను క్రమంగా యింకా యింకా ఎత్తుగా గాలిలో లేచి, ఊగుతూ, ఒరుగుతూ, ఒయ్యారంగా మయిదానం చుట్టూ గిర్రున తిరిగి, దిగువను తలలు పైకెత్తి

దానిని అట్టే చూస్తున్న మిత్రబృందము వైపు ఒకసారి మిక్కిలి చేరువగా, ప్రక్కగా, ప్రమాదకరంగా, మీద పడునట్లు ఒరిగి, మరల చప్పున సురక్షితంగా పైకి తేలి పోయింది.

చెట్లమీదుగా, గుట్టల మీదుగా, యిండ్ల మీదుగా, కోవెల గోపురంమీదుగా, ఒదుగుతూ, తేలుతూ, ఊగులాడుతూ, బ్రహ్మాండమైన చప్పుడుతో విలాసంగా ఊరు చుట్టూ ఒకసారి వలయాకారంగా గ్రద్దవలె తిరిగి, రెప్పపాటులో నది దాటి ముందుకుసాగింది ప్లేను. గోదావరివంటి మహానదే అప్పుడు నా దృష్టికి గోచీపీలిక వలె కనబడినప్పుడు, యిక తక్కినవి ఎట్లా కనబడి ఉండాలి! భగవంతుని సృష్టిలోకల్లా ఎంతో గొప్పవాడనని విర్రవీగుతూ, రొమ్ము విరుచుకొని నడిచేనరుడు ఎంతో చిన్నగా, అల్పంగా, హీనంగా క్రుంగిపోయి, భూమట్టానికి అణచుకొనిపోయిన పురుగువలె, నలుసువలె అస్పష్టంగా కనబడినాడు! ఆ యెత్తునుండి అన్నీ తిలకిస్తున్నప్పుడు నా కంటికి భూలోకమే చిన్నదై పోయింది. ఎత్తుగా, యింకా యెత్తుగా, మేఘమండలమున ఎగురుతున్నప్పుడు నాదృష్టికసలు పుడమిమీది చలనశక్తిగల జీవరాసు లేవీ అగపడనేలేదు. జనులు, జంతువులు, బండ్లు, అన్నీ క్రమంగా చిన్నచిన్నవై, ఆకారంలేనివై, రంగులమచ్చలై, నలుసులై, రేణువులై, చూస్తూఉండగానే అంతలో అదృశ్యములైనాయి. భూమిమీది ధ్వనులు, కోలాహలం, ఏవీ వినరాలేదు. పరాభవింపబడి, మూగవోయి, మూర్ఛిల్లిన

అనాథవలె కదలక మెదలక నిద్రించుచున్నట్లుండెను భూదేవి! నిశ్శబ్దంగా, కళాహీనంగా, జీవము చలనములేని ప్రాతపటమువలె ఎత్తుపల్లాలేకమై కనబడింది నేల.

నభోంతరాళమున విహరిస్తున్నప్పుడు నిజంగా నాకూ, యీ భూలోకానికీ సంబంధమేమున్నదనిపించింది! దేవలోకసంచారినగు నాకు అబద్ధాలతో, కలహాలతో, అజ్ఞానంతో మట్టినంటి ప్రాకులాడే క్షుద్రజీవులగు నరపురుగులెంతో హీనంగా, అసహ్యంగా, అల్పులుగా కనబడ్డారు! విమానంలో విహరిస్తున్నంతసేపూ ఏదో స్వేచ్ఛానందం ఆవరించింది నా హృదయాన్ని. భూమిమీది నా దాస్యజీవనం, అసత్యప్రవర్తన, సంఘభీతి, సంసారతాపత్రయం, అన్నీ నా జీవితాన్ని సంకెళ్ళవలె బంధించిన త్రుప్పుత్రాళ్ళవలె పుటుకు పుటుకున తెగిపోయినవి. భూలోకచిత్రాలను ౧౨౦౦౦ అడుగుల యెత్తునుండి వేడుకతో తిలకిస్తూ, స్వేచ్ఛగా నిర్మలాకాశమున గంధర్వునివలె ఎగురుతున్నప్పుడు నిజంగా నన్ను నే మరచిపోయినాను. తోడిమానవులకన్న నే నధికుడననీ, స్వర్గమునకు వారికంటె నే నెంతో చేరువనున్నాననీ, ఏదో వెర్రి సంతోషంతో, గర్వంతో, అర్థంకాని పరవశత్వంతో గంతులాడింది నా హృదయం.

సముద్రపు టలలను ఛేదించుకుంటూ నిర్లక్ష్యంగా ముందున కేగబడే నౌకవలె, ఎదురుగాలిని సరకుగొనక, దూదిపింజలవలె ఆకసమున అక్కడక్కడ నూగులాడు తెల్లమబ్బులను దొల్చుకొని పోసాగింది ప్లేను. ఎలుగెత్తి

పాడుకుంటూ, జువ్వన రెక్కలపై తేలియాడే విహంగం
వలె అది యింజన్ మ్రోతతో, రెక్కలకుదుపుతో, గంటకు
నూరుమైళ్ళకు మించిన త్వరితగమనంతో అంతరిక్షమున
కెగసి. దక్షిణముఖంగా ప్రయాణం సాగించింది. మధ్యా
హ్నపుటెండ చురుకుతూ అప్పుడప్పుడు పశ్చిమ కిటికీనుండి
నా మొగంమీద పడుతూఉండేది. కొలదిగమాత్రమే
తెరచిఉండిన మైకా కిటికీల ద్వారా రంయిమని ఎంతో
బలంగా వీచేది గాలి. క్రిందికి దిగజారుతూ, పైకిలేస్తూ,
గాలికెరటాలపై ఉయ్యాల ఊగుతున్నట్లు తమాషాగా
పోయేది ప్లేను.

కొంతసేపటికి, ఏదోకష్టపడి పనిచేసి అలసిపోయిన
వానివలె నిస్సారంగా నా ఆసనమున వీపుపై చేరబడి,
కాళ్ళుచాచి, 'కాబిన్'పై కప్పువేపుచూస్తూ, వెళ్ళకిల
పడుకున్నాను. అలవాటులేని వానికి త్రాగుడు వికార
పెట్టేటట్లుగా, ఎన్నడూ విమానమెక్కి ఉండని నాకు
ఆవింత అనుభవంవలన కొంచెం ఒళ్లు త్రిప్పింది. యథే
చ్ఛగా గాలి వీస్తూవున్నా, ఉక్కపోసి, ఏదో తాపంగా
ఉండెను. కోటు విప్పివేశాను. మెడనున్న కాలరు, నడు
మున బిగించుకున్న పటకా ఊడదీసినాను. జోళ్లు విప్పు
కున్నాను. దుస్తుల చికాకు సాధ్యమైనంతవరకు తగ్గించు
కొని, సదుపాయంగా మెత్తని నాస్థానమున ప్రక్కకు
ఒత్తిగిలి, విశ్రాంతిగా పడుకున్నాను. కళ్లు మూసుకు
న్నాను. కాని వికారం అణగలేదు. తల గిర్రున తిరిగిన
ట్లనిపించింది. కడుపులో కెరటాలు విరుగుతున్నట్లు

తోచింది. వాంతి వస్తున్నట్లు అయింది. ఆపుకుందుకు విశ్వప్రయత్నంచేశాను. లాభంలేదని త్వరలోనే గ్రహించుకున్నాను.

ప్లేను ఎక్కుతున్నప్పుడు బెనర్జీగారు నాకు జ్ఞాపకం చేసిన కాగితంసంచీలమాట తలపుకువచ్చింది. ఇక వాంతి ఆగదని స్థిరపడినప్పుడు చప్పున ఒకసంచీ అందుకొని, తెరచి పట్టుకున్నాను.

నేను భయపడినంతగా పెద్ద వమన మేమీ కా లేదు. కాని ఆ చిన్నవాంతికే ఒళ్లు ఆయాసపడింది. కొంచెం చిరిచెమట పోసింది. దాహం వేసింది. నీటిబిత్తి అందుకొని తృప్తితీరా చల్లని నీళ్లు త్రాగాను. ప్రాణం తెప్పరిల్లినట్లు అయింది. గాలియింకా ధారాళంగా వీచేటట్లు కిటికీలను మరికొంచెం తెరచి, బడలికతో దిండుపై శిరమువాల్చి, అప్రయత్నంగా కళ్ళు మూసుకున్నాను. జోకొట్టినట్లు నిద్రవచ్చింది. సుమారు అరగంట వరకు సౌఖ్యంగా మైమరచి నిద్రపోయాను.

కొంతసేపటికి చలివేసి మెలకువవచ్చింది. చేతినున్న వాచీ చూసుకున్నాను. మూడున్నర దాటింది. లేచికూచున్నాను. చల్లని నీటిగాలి చెంపమీద చరుస్తున్నట్లుగా వీచింది. గంటకు సుమారు ౧౨౦ మైళ్ళ చొప్పున పోతూ ఉంది ప్లేను. ఇంజన్ మోతలో యేమీ మార్పు వినరాలేదు. సన్నని కుదుపుతో గాలిలో ఒక్కచోటనే ఆగిపోయినట్లుండెను ప్లేను. ముందుకు నడుస్తున్నట్లు తోచలేదు. పుడమిమీది దృశ్యాలేవీ కంటి, కానలేదు. ఎటు

చూసినా పొగవలె తెల్లని నీటిమబ్బులు ప్లేనుచుట్టూ ఆవరించి ఉండెను. చలిగాలికి తాళలేక, పెట్టె తెరచి, బట్టతీసి కప్పుకున్నాను. తలమీదుగా అప్పుడప్పుడు చిన్న నీటి తుంపర్లు మొగంమీద పడుతూ ఉండేవి. విమానం మేఘాలమీదుగా పోతూఉందో, ఎంతఎత్తున పోతూఉందో, క్రిందను కొండలే ఉన్నవో, ఊళ్ళే ఉన్నవో, అడవులే ఉన్నవో, నదులే ఉన్నవో, ఏమున్నవో మబ్బుతెరలో నుండి యేమీ తెలియరావడంలేదు. పైని మేఘాలు, క్రిందమేఘాలు, చుట్టూమేఘాలు! పైలట్‌కు దారి ఎట్లా తెలుస్తూఉందా అని ఆశ్చర్యపడ్డాను. ఆసమయమందు వర్షంకురిసినా, సుడిగాలిలేచినా, తుపాను రేగినా, ప్లేను గతి యేమిటిచెప్మా అని పరిపరివిధాల పోయింది నా ఆలోచన. మబ్బులలో చిక్కుకొని, శ్రమదమాలకు లోనైన వైమానికులకథలెన్నో తలపుకు వచ్చాయి, ఆ ముహూర్తంలో.

లోగడ మధ్యఆఫ్రికాలోని 'సహ్రా' ఎడారిమీదుగా ఎగురుతున్నప్పుడు విలియమ్ జే మాకిన్ గారు మబ్బుల వలన పడ్డ అవస్థలన్నీ అప్పుడు నేను సులువుగా ఊహించుకోగలిగినాను. క్రింద నగపడిన అడవియేనుగుల గుంపును అట్టేచూస్తూ, ప్లేను ఎటుపోవుచున్నదీ గమనించనేలేదట, అతను. అంతలో ఎదురుగా నల్లని కంబళీవలె వ్రేలాడుతున్న దట్టమైన మేఘం ప్రత్యక్షమైంది. పిల్ల మేఘాలు కొన్ని తలలెత్తి నాట్యమాడుతూ, విషసర్పాల వలె బుసకొడుతూవుండెను. దూరాన ఒక నీలిమెరుపు

ప్రకాశించింది. కాని, యింజన్ల చప్పుడులో ఉరుములధ్వని యేదీ వినరాలేదు. ప్లేను ౮, ౯, ౧౦ వేల అడుగుల యెత్తున ఊగులాడుతున్నట్లు సూచించింది 'ఆల్టిమీటరు.' మీదికివచ్చి, ప్లేనుయొక్క రెక్కలతో పెనగులాడ ప్రారంభించాయి మేఘాలు. చలిగాలి చెమ్మగా ముఖం మీద తగిలింది మాకిన్ గారికి.

హఠాత్తుగా ప్లేనుప్రక్కగా ఒరిగి, ౫౦౦ అడుగులమేర క్రిందికి దిగిపోయింది. తన స్థానంనుండి డోర్లి, యించుమించు క్రిందపడేటట్లు ముందుకు తూలిపోయాడు మాకిన్. ఇంజన్ల మ్రోత హెచ్చింది. 'జాయ్ స్టిక్'తో అవస్థపడి, ఎట్లాగో ఒరిగిన ప్లేనును సరిచేశాడు పైలట్.

కిటికీకి చేరువగా పెద్దమెరుపు మెరిసింది. మళ్ళీ ప్లేను యిటూఅటూ ప్రమాదకరంగా ఊగులాడింది. ఇంతలో తుపాకిగుండ్ల వర్షంవలె పై కాకిటికీల మీద ఫెళఫెళ చప్పుడయింది, వడగళ్లు! కిటికీలతలుపులు నిమిషంలో జల్లెడవలె చీలిపోయాయి. మాకిన్ గారికి చిన్న చిన్న దెబ్బలు కూడా తగిలినవి.

దారి, తెన్ను, తెలియనివ్వని పొగమబ్బులోనుండి గ్రుడ్డిగా పోతూఉండెను ప్లేను. దిగువను కొండలేవైనా ఉండిఉంటే, యిక బ్రతుకుఆశ లేకనేపోయేది. ౮, ౯ వేల అడుగులయెత్తున ఎగురుతున్న ప్లేను 3 వేల అడుగుల యెత్తుకు దిగిపోయింది. దిగువను అంతా బురదగా ఉన్న ఊబి ప్రదేశం. ఆ మధ్యను మెలికలుతిరిగి, తళతళలాడుతున్న 'నైల్' నది! ప్లేను నేలపై.వ్రాలడానికి ఎంత

మాత్రం వీలులేదు. వ్రాలితే యిక బెల్లంపాకంలోపడిన యీగవలె, ఆ ఊబిలో తగుల్కొని మరికదలదు.

ఇంతలో కళ్లు మిరుమిట్లు గొల్పునట్లుగా మరొక పెద్దమెరుపు మెరిసింది. వర్షం, వడగళ్లు ఆగకుండా పడు తునే ఉండెను.

'ప్లేను పైకి లేవకుండా ఉంది' అన్నాడు పైలట్ అధైర్యస్వరంతో.

మరొక పెద్దమెరుపు! అదృష్టవశాత్తూ దానితో పెనుభూతంవంటి మబ్బు తెరఒకటి చీలిపోయింది. భూమికి రెండున్నరవేల అడుగుల యెత్తునమాత్రం వణుకుతూ ఉండెను ప్లేను. వడగళ్ళతో దట్టంగా కప్పబడి, దాని రెక్కలు బరువెక్కి తెల్లగా కనబడ్డాయి ఆమెరుపులో.

ఆకస్మికంగా మబ్బు విడిపోయింది. వెలుతురు వచ్చింది. దిగువను విశాలమైన పల్లపునేల కానవచ్చింది. రమ్యమైన సూర్యరశ్మిలో, తుపాను ఆవరణ దాటి బయట పడింది ప్లేను. దూరంగా యినుపరేకువలె తళతళ లాడు తున్న దేదో పొడగట్టింది దిగువను.

'విక్టోరియా న్యాంజాసరస్సు' అని ఆనందంతో కెవ్వున అరచాడు పైలట్.

మరికొన్ని నిమిషాలలో క్షేమంగా ఆ సరస్సు ఒడ్డున వ్రాలింది ప్లేను.

మరొకప్పుడు ఆఫ్రికాలో ఒక పైలట్ యువకుడు యిట్లానే మేఘాలలో తగుల్కొని, చావుతప్పి బయట పడ్డాడు. అతనిప్లేను హాయిగా వందమైళ్ళకు పైబడిన

వేగంతో పోతూఉండెను. ఎదురుగా నల్లని భయంకర మైన పెద్దమబ్బొకటి కనబడింది.

'ఆ మబ్బులో జొరపడితే ఎట్లాఉంటుందో?' అనుకున్నాడతను యౌవనచాపల్యంతో.

కుర్రతరహాగా విమానాన్ని సూటిగా మబ్బువైపు త్రిప్పాడు.

ఇంకోనిమిషంలో ఏదో పెద్ద చీకటిగుహలో జొరపడినట్లు అయింది అతనిగతి. అంతా కారుచీకటి. ఎటు వైపు ఏమున్నదీ తెలియలేదు. భీతావహంతో గుండె దడదడలాడింది అతనికి. ఎట్లాగో లేనిశక్తి తెచ్చుకొని, 'యిండికేటర్' వద్దనున్న విద్యుద్దీపాన్ని వెలిగించాడు. వెంటనే ప్లేనుస్థితి అర్థమైంది అతనికి. ఆచీకటిలో ప్రళయ వేగంతో పైకి తేలిపోతూవుంది ప్లేను!

'జాయ్‌స్టిక్' అందుకొని, బలంతో ముందుకు తోశాడతను. న్యాయంపట్టి వెంటనే ప్లేను క్రిందికి దిగజారవలసివుండెను. కాని, అందుకు బదులుగా యింకా పైకి లేచిపోతూవుండెను. ప్రక్కగా ఒరగడంకూడా ప్రారంభించింది ప్రమాదకరంగా. పైలట్ తన ఆసనం నుండి గెంటబడినట్లు ముందుకు తూలిపోయి అనుకున్నాడు పడిపోకుండా. దుర్భేద్యమైన ఆ కటిక చీకటిలో ఏం చెయ్యడానికీ పాలుపోలేదతనికి.

దేవుని ధర్మమా అని మరుసటిక్షణమందు మెరుపువలె ఎండ ఎదురైంది. మబ్బులోనుండి తారాజువ్వవలె చప్పున కొంతమేర క్రిందికి దిగజారింది. ప్లేను. బ్రతుకు

జీవుడా అనుకున్నాడు పైలట్!......

మబ్బులమధ్య ఎగురుతూ ఉన్నప్పుడు యిట్టి దృష్టాంతాలన్నీజ్ఞప్తికివచ్చి, నాకు కూడా ఏదైనా విచిత్రానుభవం సంభవిస్తే బాగుండు నే అనిపించింది! పెద్ద తుపాను రేగి, ప్లేను అందులో చిక్కుకొని అవస్తపడి, మళ్ళీ ఏప్రమాదము లేకుండా, జయప్రదంగా ముందుకు సాగిపోతే నిజంగా ఎంత తమాషాగా ఉండేది! కాని ప్రమాదాలుమాత్రం మనం కోరుకున్నప్పుడు, కోరుకున్న విధంగా వస్తాయా? ఒడుదుడుకు లేవీ లేకుండా రమ్యంగా పోతూఉంది ప్లేను, మేఘాలను లెక్కచేయకుండా.

ఒకొక్కప్పుడు నీటిమబ్బులు ఆవరించివున్న ప్రదేశంలో ఎగురుతూవున్నప్పుడు చిత్రవిచిత్రములైన తమాషాలు జరగడం కలదని చెప్తారు విమానానుభవం బాగా వున్నవాళ్లు.

ఎగురుతూవున్న ప్లేనును కసితో వెంబడిస్తూ, ఏని మిషంలో మీాదపడి ఢీకొంటుందో అన్నట్లు కానవస్తుందట మరొకప్లేను. నిజంగా యీా రెండవ ప్లేనువలె కనబడేది ఎగురుతూవున్న విమానంయొక్క ప్రతిబింబమే. సూర్య కిరణాలు మబ్బుపై పడి, ప్రతిఫలించి, యీా విధంగా కంటిని భ్రమగొల్పుతాయి. అనుభవజ్ఞుడైన పైలట్ అట్టి సమయాలలో కంగారుపడక, 'జాయ్ స్టిక్'ను గుంజి, యింకాపైకి ఎగిరిపోతాడు.

మబ్బులమీాదుగా పోతూవున్నప్పుడు మరికొన్ని సమయములందు దిగువను పెద్దసుడిగుండంవంటి రంధ్ర

మేవో ప్రత్యక్షమవుతుందట! నల్లగా గుహాద్వారంవలె నోరు తెరచుకొని, ప్లేనును ప్లేనులో ఉన్నవాళ్ళను అమాంతంగా మ్రింగివేయడానికి సిద్ధంగాఉన్న రాక్షసి వలె కనబడుతుంది ఆమహారంధ్రం. ప్లేను ఎంతవేగంగా పోతూఉంటే, అంతవేగంతోను అదికూడా వెన్నంటి వస్తునే ఉంటుంది. ప్లేను కదలుతున్నట్లు అవుపడదు. ఆ కన్నంమీదుగా నిల్చి, ఏ ఘడియకో అందులో దుమక డానికి యత్నిస్తున్నట్లు ఉంటుంది. ఆ మబ్బుప్రదేశం దాటి పోయి, గాలి పలచబడిన చోటుకు చేరుకున్నదాకా, భయంకరంగా ఆ రంధ్రం అట్లానే అగుపడుతూఉంటుంది.

మొత్తానికి నేను మబ్బులలోనుండి ఎగురుతూఉన్న ప్పుడు ముచ్చటకైనా యిట్టి వింతదృశ్యాలేవీ అగుపడ లేదు. నలువైపులా శోధించి మరీ చూశాను, వెంట తరుముతున్నట్లు మరొకప్లేనే కానవస్తుందో, లేక దిగు వను భూమి బ్రద్దలైనట్లు పెద్దచీకటిసారంగమే కనబడు తుందో, అని. వెనక్కి తిరిగి పైలట్ ఏంచేస్తున్నాడో అని చూశాను, నాకూ ఆయనకూ మధ్యనున్న గాజు తెరలోనుండి. నిశ్చింతగా విమానాన్ని పోనిస్తూ, ఏదో కాగితంచూస్తున్నాడతడు. అతని కుడిచెంపమీద సన్నని ఎండ పడుతూవుంది.

మబ్బులు మాయమైనాయి. సౌఖ్యంగా, వెచ్చగా వీచింది గాలి. కొండలు, నదులు, పట్నాలు, అడవులు, పొలాలు, అన్నీదాటి యథేచ్ఛగా పోతూవుంది ప్లేను. తలత్రిప్పు, కడుపులో వికారం మొదలైన చికాకులేమీ

లేక, దూర్బినియంత్రం చేతపట్టుకొని, దృష్టినిగిడ్చి అన్నీ ఆనందంతో చూస్తూ, హాయిగా కూచున్నాను.

మానవుడు తన బుద్ధివిశేషంవలన యిప్పటికి కని పెట్టిన అద్భుతాలలో నిజంగా గాలిప్రయాణ మొకటి కదా అనుకున్నాను, నాలో నేను. 3౨ సంవత్సరాలక్రిందట 'కిట్టీహాక్' అనే మైదానంమీద 'రైట్' సోదరులు గ్లయి డర్లలో ఎగరడానికి పడినపాట్లు తల్చుకుంటే, యిప్పు డెంతో ఆశ్చర్యమవుతుంది.

'ఇంకా నూరేళ్ళవరకూ గాలిలో ఎగరడానికి మానవమాత్రుడికి సాధ్యంకాదు!' అన్నా డప్పుడు నిరా శతో ఆ సోదరులలో చిన్నవాడైన ఓర్విల్‌రైట్.

నేడు ప్రఫెసర్ పికార్డ్‌వంటి ప్రజ్ఞావంతులు 'స్ట్రాటోస్ఫియర్'లో భూమికి ౧౨ మైళ్ళ యెత్తున, గంటకు 3౦౦ మైళ్ళ వేగంతో ప్రయాణం చేయగలుగు తున్నారు. జర్మనీలో కొందరు సయింటిస్టులు చంద్రలో కానికి ప్రయాణం సాగించేటందుకు ఉపాయమేమిటా అని తీవ్రంగా ఆలోచిస్తున్నారు!

బహుశః మరికొన్నాళ్ళకు నేటివిమానాలు త్రొ క్కుడుబండ్లవలె ప్రయాణానికి సామాన్యసాధనలు కావచ్చు. ఇప్పుడు గాలిప్రయాణాలలో తరుచుగా సంభ విస్తున్న ప్రమాదాలు మున్ముందు ఉండనే ఉండక పోవచ్చు. ప్రయాణ మింతకంటె సౌఖ్యప్రదంగానూ, క్షేమ కరంగానూ, వేగంగానూ జరగవచ్చు. ఒకవేళ 'రాకెట్ ప్లేన్ల'లో చంద్రలోకాన్ని చేరుకోవడమే నిజంగా

సిద్ధిస్తే, యిక మానవుడు దేవతలతో వియ్యమందవచ్చు నన్నమాట !

భూమిమీద రెయిళ్ళకు, సముద్రంమీద ఓడలకు బాటలేర్పడినట్లు, గాలిలో కూడా విమానాలకు దారు లేర్పడుతున్నాయి. విమానశాస్త్రజ్ఞులు స్వయంగా పై కెగిరి వాయుమండలంలోని పరిస్థితులన్నీ శోధిస్తున్నారు. 'రేడియో' సహాయ్యమున ఎప్పటికప్పుడు వారి పరిశోధ నలను టెలిఫోనుద్వారా మిత్రులకు తెలియజేస్తున్నారు. మహారణ్యాలగూర్చి, సముద్రాలగూర్చి తెలుసుకున్న విశే షాలకన్న, గాలినిగూర్చి యెక్కువ సంగతులు కనిపెట్ట గలిగినారు సయంటిస్టులు. కాని, భూమిమీద, నీటిమీద వారికి అర్థంకాని ప్రకృతిరహస్యాలు ఎన్నో ఉన్నట్లుగానే, వాయుప్రపంచమందుకూడా తెలియరాని అద్భుతరహ స్యాలు ఎన్నో బయటపడుతున్నాయి. విమానసంచారుల కొన్నికొన్ని వింత అనుభవాలకు సయన్సు బొత్తిగా సమా ధాన మీయలేకుండా ఉంది !

ఈమధ్య విలియమ్ జే. మాకిన్ గారు 'ఆకాశ రహస్యాలు' అనే శీర్షికక్రింద అనేక అద్భుతవిషయాలను సేకరించి 'నాష్' పత్రికలో ప్రకటించారు. అందు కొన్ని చాలా చిత్రంగా ఉన్నాయి—

౧...ఈజిప్టురాజుల గోరీలుగల 'ప్రభువుల లోయ' అనబడు మైదానంమీద ఎగిరేటప్పుడు కొన్నికొన్నిచోట్ల ఎంతప్రశస్తమైన 'రేడియో' యంత్రాలైనా సరే, చచ్చి నా పనిచెయ్యవు. ఎందరో సయంటిస్టులు సున్నితమైన

'రేడియో సెట్టు'లను వెంట తీసుకొనిపోయి, పలికించలేక ప్రాణంవిసిగి ఊరుకున్నారు. 'రేడియో'ను చంపగల అస్థల మహాత్త్వమేమో తెలియరాకున్నది.

౨...మొన్నటి ఐరోపాసంగ్రామదినాలలో ఒక నాడు కొందరు బ్రిటిష్‌వైమానికులు దూరంనుండి తమ వైపువస్తున్న ఒక యింగ్లీషుప్లేనును చూశారు. 'ప్రాటి ల్' మాయమబడిన చప్పుడు అయింది. ఇక ప్లేను 'ఎయి రోడ్రోమ్' మీదుగా ఒకచుట్టుతిరిగి, మెల్లగా భూమి మీద వ్రాలుతుందని అనుకున్నారు వాళ్లు. కాని అట్లా జరగక, ఆగవలసిన స్థలంమీదుగా తిన్నగా ముందుకు పోయింది ప్లేను. అప్పుడు కొంచెం అనుమానం కలిగింది ఆ ఆంగ్లసైనికులకు. అది బ్రిటిష్‌విమానం కాదేమో అనీ, అందులోనుండి జర్మనుచారు డెవడో రహస్యంగా క్రిందికి దిగనున్నాడనీ, ఏమేమో అనుకున్నారు వాళ్ళు. వెంటనే తుపాకులు, 'బాంబు'లు పట్టుకొని, ప్లేనువెంట పరుగె త్తారు. అది నెమ్మదిగా 'ఎయిరోడ్రోమ్' దాటి, చేరువ నున్న పొలాలలో క్షేమంగా వ్రాలింది. లోన యిద్దరు ఆఫీసర్లు ఎవరోఉన్నట్లు చూశారు బ్రిటిష్‌సైనికులు. తుపాకులుచూపి బెదరించి, కేకవేసి పిలిచారు వాళ్ళను. కాని ఆ ఆఫీసర్లు ఉలకలేదు, పలకలేదు. తీవిగా వారిస్థా నాలలో అట్లానే కూచున్నారు. ధైర్యంచేసి బ్రిటిష్‌సైనికు డొకడు చేతనొక బాంబుపట్టుకొని, ప్లేనును సమీపిం చాడు. అప్పుడు ఆ ఆఫీసర్ల నిజస్థితి బోధపడింది అతనికి. ఇద్దరూ చనిపోయి కొయ్యలై ఉన్నారు కుర్చీలలో.

గాలిలో ఎగురుతూఉండగా కొంతసేపటి క్రిందట వాళ్ళను శత్రులెవరో తుపాకితో కాల్చి చంపినారు. గుండు దెబ్బలు తగిలీ తగలడంలో వాళ్ళప్రాణాలుపోయి ఉండవలెను. కాని, విమానం ఆగలేదు. నడిపేవాడు లేకపోయినా, దానంతట అదే యెగురుకొనివచ్చి మిత్ర శిబిరంవద్ద వ్రాలింది!

3...౧౯౧౮-లో యుద్ధసంధి యింకా కొద్దిరోజులకు పొసగుననగా 'నోమాన్సులాండ్' అనేచోట యిట్టిదే ఒక విమానచిత్రం జరిగింది. కొందరు బ్రిటిష్‌వాయుసైనికులు శత్రుసేన లున్నవైపునుండి ఒకవిమానం మహా వేగంగా తమవైపు వస్తూవుండడం చూశారు. దగ్గరకు వచ్చినపిమ్మట దాన్నిచూసి వాళ్ళు ఎంతో ఆశ్చర్యపడ వలసివచ్చింది. ఎర్రని రక్తవర్ణంగల 'ఫొక్కర్' ప్లేనది. 'బేరన్‌వాన్ రిచ్‌థాఫెన్' అనే జర్మన్‌యువకుడొకడు అప్పటికి కొలదినెలలు క్రితమే అట్టిప్లేనులో ఎగురుతూ ప్లేనుతోకూడా క్రిందపడి చనిపోయినాడు. ఈ కానవచ్చిన విమానం అతనిదివలె తోచింది ఆ బ్రిటిష్ సైనికులకు.

ప్లేను బ్రిటిష్‌సేనలు విడిసియున్న తావునకువచ్చి దిగువగా ఒరిగింది. పైలట్‌స్థానమున కూర్చునివున్న పరిచయపురుషుడు చెయ్యూపి సలామొనర్చినాడు. వెంటనే ప్లేను మళ్ళీ ఎత్తుగా లేచిపోయి, వచ్చినదారినే మరలిపోతూ, చూస్తూఉండగానే మబ్బులలో మాయమైంది. బ్రిటిష్‌పైలట్లు తమ విమానాలలో దానిని వెంటతరిమినారు. కాని ఆ రక్తవర్ణవిమానం మరి కానరాలేదు.

ఎందరో పైలట్లు యీ అద్భుతచిత్రాన్ని స్వయం గా చూసినట్లు చెప్తారు. చనిపోయిన ఆ జర్మన్ యువకుని సూక్ష్మదేహం ఆవిధంగా ప్రత్యక్షమైనదని వాళ్ళ నమ్మకం!

౪...కొన్నాళ్ళక్రిందట యింగ్లాండులో 'షెప్ప ర్టన్ - ఇన్ - థేమ్స్' అనేఊళ్ళో పలుసార్లు ఒక తెల్లని ప్లేను మసకమసకగా గాలిలో కనబడేదనిన్నీ, దాని యింజన్ మ్రోత స్పష్టంగా వినవచ్చేదనిన్నీ, ఊరుచెంత నాకపాలంలో అది నేలనుగుద్దుకొని ధ్వంసమైనట్లు పెద్దగా చప్పుడు అయేదనిన్నీ, ఆ ఊరివాళ్ళు అనేకులు చెప్తారు. తీరావెళ్ళిచూస్తే ఎక్కడా ప్లేను పడిపోయినట్లు జాడలేవీ కనబడేవికావట!

ఈ చిత్రానికి మూలకథయేమిటంటే, కొన్ని యేళ్ళక్రిందట అట్టి తెల్లనిప్లేనులో ఒక పైలట్టు, ఒక యంత్రమరమ్మత్తుదారుడు ఆ ఊరిమీదుగా ఎగు రుతూ, ఏదో ప్రమాదం వచ్చి ప్లేనుతోసహా క్రిందపడి పోయి చనిపోయినారట. పిదప దెయ్యాలై వాళ్ళు అప్పు డప్పుడు తమ జీవితాంతనాటకాన్ని ఆవిధంగా ప్రదర్శిస్తూ ఉండేవారని, ఆ పురజనుల నమ్మకం!

౫...ఒకసారి 'రాయిల్ ఎయిర్ఫోర్సు'కు చెందిన పెద్దఉద్యోగస్తుడొకడు కెంట్ ఎయిరోడ్రోమ్ మీదుగా గాలిలో నిప్పంటుకొని తోకవద్ద మండుతూఉన్న ఒక ఆంగ్లవిమానాన్ని తాను స్వయంగా చూసినట్లు రిపోర్టు చేసినాడు. తీరా విచారిస్తే నాడు ఏప్లేనుకూ అట్టి ప్రమా

దం జరిగిఉండలేదని తేలింది. అయితే, కళ్ళారాచూడనిదీ ఆ ఉద్యోగస్తుడు బొల్లిరిపోర్టుచేసే మనిషికాడు. వాస్తవంగా ఆతనికంటికి ఒకప్లేను దగ్ధమౌతున్నట్లు కనబడి ఉండాలి!

౬...కొన్నికొన్ని సమయములందు విమానసంచారులకు గగనమండలమందు జటాయువు వంటి రాక్షసబలంగల వింతవింత జీవరాసులేవైనా ఉంటాయేమో అని అనుమానం కలుగుతూఉంటుంది. సముద్రంలోని తిమింగలాలు, 'షార్కు'లు మనుషులను అమాంతంగా మ్రింగివేయగలిగినట్లు, ఆకాశమందు విమానాల నైనా రొక్కాని వాటిలోని మనుషులను చంపి భక్షించే పెద్దజాతి పక్షులు కాని, మరియే యితరజీవులు కాని ఉండకూడదా అని కొందరి తలంపు!

వాయుప్రపంచమందు మానవుడు కనిపెట్టజాలని చిత్రాలింకా యేమున్నవో యేమోకాని, ఒక్కొక్కప్పుడు పైకెగిరి ప్రయాణంచేస్తున్నవిమానం అత్యద్భుతంగా అంతర్ధానమైపోతుంది. ౧౯౩౧-వ సంవత్సరంలో 'సదరన్ క్లౌడ్' అనే పేరుగల ఆస్ట్రేలియా విమానమొకటి ఆవిధంగా మాయమైపోయింది. ఇద్దరు సారథులు, ఆరుగురు ప్రయాణీకులు ఉండిరి ఆప్లేనులో. 'సిడ్నీ' నుండి 'మెల్బోర్న్' వెళుతూ మధ్యలో ఆప్లేను ఏమయిపోయిందో యిప్పటికికూడా తెలియరావడంలేదు!

*　　*　　*　　*

గాలి కెరటాలపై విమానం తేలియాడుతున్నట్లే,

నామనను పిచ్చిపిచ్చి ఊహలమధ్య ఊగులాడింది. 'హటాత్తుగా ఏ నిమిషమందయినా యింజను ఫెయిలయితే? 'టాంక్' చిల్లిపడితే? రెక్కలు నిప్పంటుకుంటే? 'సడరన్ క్లౌడ్' వలె యీ ప్లేనుకూడా గాలిలో అంతర్థానమయిపోతే? అప్పుడు దేవకన్యకలు నన్ను ఆహ్వానించి యింద్రలోకానికి తోడ్కొని పోతారేమో!...అక్కడ ఎట్లా ఉంటుందో?...మరణానంతరమే కాని సజీవంగా స్వర్గానికి ఎందువలన పోలేమో?...'

ఎండ వేడిమితగ్గి, గాలి హాయిగా వీస్తూఉంది. భూమిమీది ధ్వనులు, ధూళి, పొగ, యేవీలేక మనోజ్ఞంగా ఉంది ప్రయాణం. ఎప్పటికీ ప్రయాణం ముగియక, యిట్లానే హాయిగా ఎల్లప్పుడూ ఎగురుతూఉంటే ఎంతో బాగుండును!

ప్రియురాలితో ఏకాంతంగా తోటలో ఉయ్యాల ఊగేటప్పుడు కలిగే రమ్యమయిన ఒళ్ళుత్రిప్పు; మిత్రులతో వినోదంగా విందారగించునప్పుడు మోతాదుత్రాగుడొసగే మనోజ్ఞమయిన మయికం; అందకత్తెయైన ఆంగ్ల జవ్వనిని వెచ్చగా కౌగిటనదుముకొని ఆమెతో నాట్యమాడేటప్పుడు నరాలలో జనించే యింపైన దూకుడు; ప్రకృతిశోభ నేకాగ్రచిత్తంతో వీక్షించునప్పుడుకాని, మధురమయినపాటలో లీనమైనప్పుడు కాని, కమ్మనివాసనల ననుభవించునప్పుడుకాని, కలిగే అర్థంకాని ఆనందపరవశత్వం;—అన్నీ నాలో మిళితమయి ఉండెను, ఆ సమయమందు. ఊళ్ళు, చెట్లు, రోడ్లు, అన్నీ యేకమయి పిల్లలు

కట్టే బొమ్మరిండ్లవలె బహుచిన్నవిగా, చిత్రంగా, అందంగా కనబడేవి. నాయెడమచేతిపైపున తాపిన 'స్లేటు' పలకవలె నున్నగా, నీలిగా అగపడింది సముద్రం. పెద్ద పెద్దయిండ్లు, మేడలు దూరాన పొలాలలో పేర్చినట్లు పడిఉన్న చిన్నచిన్న రంగురాళ్ళ కుప్పలవలె కనపడేవి. పైని ఎగురుతూ చూసేటప్పుడు ఎంత గంభీరంగా కాన వస్తుందో అనుకున్న మహాబ స్తీ చెన్నపట్నమ్మది! ప్లేను లోకూచుని యింకా నిండా 3 గంటలసేపైనా కాలేదు. సరదా తీరకమునుపే వచ్చేసింది గమ్యస్థానం. భద్రాద్రి నుండి చెన్నపట్నానికి నిజంగా 3౨౮ మైళ్ళదూరం ఉన్నదా అనిపించింది. ఎగురుతున్నంతసేపూ దివ్యమయిన స్వప్నావస్థలో ఉన్నట్లు ఎంతో హాయిగా ఉండెను. విసుగు, భయం, బడలిక, యేమీ తోచలేదు.

జయప్రదంగా తనపని తాను నెరవేర్చగలిగి నందుకు గర్విస్తున్నట్లు 'ఫ్లయ్‌యింగ్‌క్లబ్' వద్ద ఠీవిగా వ్రాలింది ప్లేను.

'ప్రయాణం మీకు తృప్తికరంగా కులాసాగా ఉండెనని తలుస్తాను' అన్నారు ఎవరెట్‌గారు, నాతో షేక్‌హాండ్ చేస్తూ.





ఆంధ్రభూమి ముద్రణాలయము—వేపేరి, మదరాసు.

# వయోజనవిద్య

ప్రజాలోకమున ప్రబలియున్న అవిద్య కారణముగా మన దేశమున ఏయుద్యమము తలపెట్టినను సత్వరాభివృద్ధి నందకున్నది. పల్లెటిపట్టులందు చదువుకొనని వయోజనులును, చదువుకొనిన యువకులును ఒకేస్థితియందున్నారు. చదువుకొనని వయోజనులు ఎట్లును అవిద్యయందే క్రమ్గుచున్నారు. ఇక ప్రాథమికవిద్య నలవఱచుకొనిన యువకులును పాఠశాలవీడిన తరువాత చదువుకొనుటకు తగు పుస్తకములులేక పాఠశాలలో తాము నేర్చిన స్వల్పవిద్యను అచిరకాలముననే మరచిపోయి మరల అవిద్యకు మరలుచున్నారు. ఈస్థితి తొలగి వయోజనులలోను, యువకులలోను విద్యావ్యాప్తి బాగుగ జరుగువలయుననుచో ఒజ్జలను నియమించుటకంటె, రాత్రి పాఠశాలలను పెట్టుటకంటె పఠనయోగ్యములగు పుస్తకములు వ్రాయించి ప్రచురించుట ముఖ్యము.

. వికాసముతోకూడిన విద్యావ్యాప్తికి పుస్తకములే ప్రధానసాధనము లగుట విశేషవిద్యావ్యాప్తిలేని మన భారతదేశముననే గాక విద్యాశిఖర మంటిన పాశ్చాత్యదేశములందును గుర్తింపబడియున్నది. 'మంచి పుస్తకములపై మనసున్నవానికి వేఱుగా విశ్వసనీయుడైన మిత్రుడుగాని, అనురాగయుక్తుడైన ఆశ్వాసకుడుగాని, ఉల్లాసకరమగు తోడుగాని అక్కఱలేదు' అని భారతీయ ప్రముఖుడగు ఖుషీరామ్ చెప్పినట్లే- పాశ్చాత్యప్రముఖు

డును, ఆంగ్లమంత్రిమాణిక్యుడును అయిన గ్లాడ్ స్టన్ 'ప్రథమమున మంచిపుస్తకము చదివినప్పుడు నేనొక క్రొత్తస్నేహితుని సంపాదించుకొనినట్లుండెను. అది రెండవసారి చదివినప్పుడు ప్రాతస్నేహితుని గలసికొని నట్లుండెను' అని చెప్పినాడు. భారతీయులకు ఆంగ్లవిద్యా భిక్ష పెట్టిన మెకాలే ఒకచో 'మంచి పుస్తకములు చదువుటకుగాని మహారాజుగా నుండుటకంటె పేదకొంపలో జదువుటకు పుస్తకములు పుష్కలముగానుండు పరమదరిద్రుడుగానుండుట నాకిష్టము' అని వ్రాసియున్నాడు. ఆంధ్ర దేశమునందలి ఉన్నతపాఠశాలల ప్రధానోపాధ్యాయులలో పీనుమిగిలిన కూచి నరసింహము పంతులుగారు అనువదించిన 'ఆదర్శసుఖజీవనము' అను గ్రంథమున 'అనివార్యమైనయెడల ప్రాతచొక్కా తొడుగుకొనుము. కాని శక్తి యున్నచో క్రొత్తపుస్తకము కొనుట మానకుము. గత్యంతరము లేనప్పుడు చింపిగుడ్డలు కట్టుకొనవచ్చును, అతుకులచెప్పులు తొడుగుకొనవచ్చును, ఒక్కపూటయే తిని బ్రతుకవచ్చును, కాని నీవు సద్గ్రంథముల పట్టున మాత్రము వ్యయభీతిచే నెప్పుడును లోభివిగాకుము.' అని చెప్పియున్నారు.

క్రొత్త పుస్తకములను కొనుటమానకుము! సద్గ్రంథములపట్టున లోభి వి గాకుము!! ఎంతటి చక్కని ఉపదేశములు. ఆంధ్రులు ప్రత్యేకముగ శ్రద్ధచేయదగిన ఉపదేశరత్నము లివి.

గుంటూరు మండలమునందలి సనాతనసంప్రదాయ ముగల ఆంధ్రవైశ్యకుటుంబమునకు చెందిన జమిలి నమ్మా

ళ్వారుగారు మద్రాసు కార్యస్థానముగా పెట్టుకొని ఆంధ్ర మున క్రొత్తవియు, మంచివియునగు పుస్తకములను ప్రచురింపదొరకొనినారు. ఇంతవరకు పండ్రెండు ఉత్తమ గ్రంథములు వెలువడినవి. అవిఅన్నియు పయోజనవిద్యా వ్యాప్తికి బాగుగ ఉపకరించునవిగానున్నవి. కావున ఆంధ్రులీఉత్తమగ్రంథప్రకాశకునకు తగుపోషణప్రోత్సాహములు కలిగించుటపై ఉపదేశమును శిరసావహించుటయే యగును. —ఆంధ్రభూమి.

# నమ్మాళ్వార్స్ ప్రచురణముల లో ఇంతవరకు వెలువడిన గ్రంథములు

౧. స్పెయిన్ దుస్థితి (ప్రతాప రామసుబ్బయ్య)
౨. చీనాజపాను ప్రళయము (జి. హరిసర్వోత్తమరావు)
౩. శశాంక (గుడిపాటి వెంకటచలము)
౪. తిలోత్తమ-పాపయ్యశర్మ(పులవర్తి కమలావతిదేవి)
౫. విపంచి- కాత్యాయని (బొడ్డు బాపిరాజు)
౬. ప్రపంచవీరులు (గోపరాజు వెంకటానందం)
౭. వెంకటచలంకథలు (గుడిపాటి వెంకటచలం)
౮. శిరోమణికథలు (శ్రీనివాస శిరోమణి)
౯. భాగ్యసౌధము (శ్రీగిరాజు రామారావు)
౧౦. రాజకీయశాస్త్రము (మంతెన సుబ్బరాజు)
౧౧. కృష్ణమూర్తికథలు (తాత కృష్ణమూర్తి)
౧౨. ప్రభుత్వము (గాడిచర్ల హరిసర్వోత్తమరావు)

ఆంధ్రభూమి ముద్రణాలయము—వేపే., మద సు.